# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ,
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

చందమామ (అన్ని భాషలలో)
(విడి కాపీ 50 నయా పైసాలు. 8 అణాలు)
సాలు చందా రు. 6 లు.

# తెలుగు చందమామ లేఖలు

## జూలై 1961

అట్టమీది బొమ్మకు శ్రీ వడ్డాది పాపయ్య వేసిన చిత్రాలు, రామాయణానికి శ్రీ శంకర్ వేసిన చిత్రాలు చాలా బాగున్నవి.

—పి. వెంకన్ గౌడ్, గద్వాల

అట్ట చివరిబొమ్మ అమోఘంగా ఉంది.

—టి. జయప్రకాశ్, నిజామాబాద్

అట్ట వెనుక బొమ్మ చాలా బాగుంది. ఆచార్యగారికి నా అభివందనములు. కాని భీముడు దుశ్శాసనుని మెడపై కాలుంచి గుండెలు చీల్చినట్లు వ్రాశారు; బొమ్మలో అందుకు విరుద్ధంగా ఉన్నట్లున్నది.

—యేలూరి రామకృష్ణారావు, రాజమండ్రి

"జ్వాలాద్వీపము"తో పాఠకులను ఉర్రూత లూగించిన శ్రీ దాసరి సుబ్రహ్మణ్యముగారి చేత మరియొక సీరియల్ వ్రాయించమని కోరు చున్నాను.

—లంక కోటేశ్వరశర్మ, గుండుగొలను

"కళ్ళుతెరిచిన యువరాజు", "తారుమారు" చాలా బాగున్నాయి. ఎన్నిసార్లయినా చదవాలని పిస్తున్నవి. నెలవరకూ "చందమామ" కొరకు ఎదురు చూడాలంటే చాలా కష్టంగాయుంది.

—పి. లాజరస్, కె. ఏలియా, మారేడుమిల్లి

"గర్వభంగం," "రాజైన రైతు" చదివి ముచ్చటపడ్డాను. "రామాయణం" ముఖ చిత్రం "చందమామ" అందాన్ని రెట్టింపు చేసింది.

—వారణాసి సూర్యారావు, మీనవిల్లూరు

"అక్షయపాత్ర", "గర్వభంగం", "తారు మారు" చాల బాగున్నవి. అట్టమీది బొమ్మ ఎంత చూచిన తనివితీరుటలేదు.

—ఐ. జనార్ధనరెడ్డి, మినగల్లు

"రామాయణం" చాలా బాగుంది. దానికి శ్రీ వడ్డాది పాపయ్యగారు వేసే ముఖ చిత్రం, శంకర్‌గారు వేసే బొమ్మలుగూడా బాగున్నాయి.

—సాదఖ్ హుస్సేన్, కడప

"చందమామ"కు జన్మదిన సందర్భములో నా అభివందనములు తెలుపుచున్నాను.

—వి. శ్రీనివాసరావు, మద్రాసు - 4

"చందమామ" ఎప్పుడు వస్తుందా అని దిన మొక యుగంగా గడిపేస్తున్నాము. "చందమామ"లో అనిర్వచనీయమైన ఆకర్షణ ఉంది. గులాబీ చక్కదనం, జిలేబీ తియ్యదనం "చందమామ" చల్లదనం ముందు ఎందుకు పనికిరావు.

—వేంపల్లి అబ్దుల్ ఖాదర్, కలికిరి

ఈ నాటివరకు ఏ పత్రికా సాధించలేని ఘన విజయాన్ని "చందమామ" ఒక్కటే సాధించిందనడంలో అభ్యంతరం ఏమీలేదు.

—షేక్ కరీం అహ్మద్ షరీఫ్, గోపాలపురం

"శమంతకమణి" ముగింపు చాలా బాగున్నది.

—కె. రామానుజాచార్యులు, ఎర్రుపాలెం

# తరచుగా వచ్చే దగ్గు మరియు రొంప ఓపికను తగ్గిస్తాయి... శ్వాసనాళములకు కలిగే అంటువ్యాధులను అడ్డే శక్తిని తగ్గిస్తాయి

దగ్గు మరియు రొంప బాధను కలిగించడమే కాకుండా అవి తరచుగా వస్తూంటే వాటిని గురించి బెంగ పెట్టుకోవలసి వస్తుంది. వాటర్‌బరీస్ కాంపౌండ్‌ను త్రాగుట వెంటనే ప్రారంభించండి.



వాటర్‌బరీస్ కాంపౌండ్

- ★ దగ్గు నుండి మరియు శ్వాస నాళములు పూడుకొని పోవుట నుండి స్వస్థత కలిగిస్తుంది.
- ★ దగ్గు, జలుబులను ఎదుర్కొనే శక్తిని పెంపొందిచును.
- ★ ఆహారము ఒంటబట్టుటలో సహకరిస్తుంది.
- ★ శరీరములోని అన్ని అవయవములకూ శక్తినిచ్చును




క్రిసోట్ మరియు గైకాల్‌తో పుష్టికరము చేయబడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ శ్వాసనాళములు పూడుకొని పోవుటను మరియు చాల కాలము నుండి బాధపెడుతున్న దగ్గు మరియు రొంపను పోగొట్టును. మీ ఒంట్లో ఆరోగ్యమును క్రమపరచి వ్యాధులు రాకుండా చేయుటయే కాక మీరు సంవత్సరము పొడుగునా శక్తి, ఉత్సాహములతో పని చేయుటలో సహకరిస్తుంది. పిన్నా పెద్దా అందరికీ బాగుగా గుణము కలిగిస్తుంది.

మంచి రుచిగల దీనిని - త్రాగండి

## వాటర్‌బరీస్ కాంపౌండ్

(ఎఱ్ఱ లేబిలు)

మీకు శక్తి ఉత్సాహములు యిస్తుంది



ఈ రకముది కూడ లభిస్తోంది : కేసరి రంగు లేబిలుగల వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్. ఇది అన్ని విధముల వాడదగిన టానిక్‌గా సిఫార్సుచేయబడినది

వార్నర్ - లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ. లో స్థాపింపబడినది)

W-161




బొంబాయి 16, మహీమ్ లో డి 8, యూనియన్ హౌస్ యందున్న శ్రీమతి. ఆర్.ఆర్. ప్రభు ఇలా చెప్పుచున్నది; 'ఆయనకేదీ మెప్పులేదు. ఇంక బట్టల సందర్భంలోనా...!' ఇప్పుడు ఆయన బట్టలన్నిటినీ సన్‌లైట్‌తో ఉతుకుతున్నాను ...' ఆయనకూ, నాకూ పరమానందం! సన్‌లైట్ సమృద్ధిగా నురగ నిస్తుంది. ఉతికే పని నాకెంతో సులభం! 'నేను ఉతికేవన్నీ తెల్లగాను, కాంతిగాను ... పరిశుభ్రంగా వుంటాయి! నాకు సన్‌లైట్ తప్ప మరేదీ నచ్చదు!'

బట్టలను శుభ్రంగా ఉతుకుటకు ఉత్తమమైన, సొమ్ము మగు సన్‌లైట్ వంటిది కేదీ లేదని గృహిణులు తెలుసుకున్నారు. మీరు కూడా గ్రహించెదరు.

# సన్‌లైట్




మీ బట్టలకు వరప్రసాదం!

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

S.30-X29 TL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

రామాయణం [బాలకాండ] అందరు పాఠకులనూ తృప్తి పరిచినట్టు కనిపిస్తుంది. ఇది మాకెంతో ఆనందంగా ఉన్నది. దీనికి రంగుల బొమ్మలు చిత్రించే శంకర్ గారికి అనేక మంది పాఠకులు అభినందనలు తెలుపుతూ రాశారు. వారికి మా ధన్యవాదాలు.

ఈ సంచికలో "రాకాసిలోయ" అనే కొత్త రంగుల బొమ్మ సీరియల్ ఆరంభమవుతున్నది. ఇదికూడా "జ్వాలా ద్వీపం" లాగే పాఠకులకు ఆనందోత్సాహాలు చేకూర్చగలదని ఆశిస్తాము.

ఈ సంచికలో ప్రారంభమవుతున్న మరొక సీరియల్ శ్రీ ఉత్పలవారి గేయకథ "దక్షయజ్ఞం". దీనికి ఈసారి శ్రీ వడ్డాది పాపయ్యగారు చిత్రాలు వేస్తున్నారు.

ఈనెల మీకు గుండు భీమన్న పాత్రను పరిచయం చేస్తున్నాము. ఈ భీమన్న చర్యలు కొన్ని మాసాలపాటు "చందమామ" లో మీరు చదువుతారు.

సంపుటి 29 : జూలై 1961 : సంచిక 1

CHITRA




# పనికిమాలిన పనితనం

ఒక నగరంలో ఒక రాజుగారు ఉండేవాడు. తన రాజ్యంలో వృత్తి విద్యలను ప్రోత్సహించే ఉద్దేశంతో ఆయన వివిధవృత్తుల వారికి అప్పుడప్పుడూ బహుమతులిస్తూ ఉండేవాడు. దేశంలోని వడ్రంగులూ, కమ్మరులూ, కుమ్మరులూ, నేతగాళ్లూ, కమసాలులూ, నగిషీపనివారూ, శిల్పులూ, చిత్రకారులూ తాము తయారుచేసిన వస్తువులలో మేలైనవి ఉన్నప్పుడు రాజుగారికి తెచ్చి చూపుతూండేవారు. ఆ వస్తువులలో ప్రత్యేకమైన పనితనం కనిపించినప్పుడల్లా రాజుగారు వారికి మంచి బహుమానా లిచ్చి పంపేస్తూ ఉండేవాడు.

ఒకనాడు ఒక గ్రామం నుంచి ఒక నేతగాడు ఒక మేలైన శాలువ నేసి తీసుకుపోయి రాజుగారికి చూపాడు. రాజుగారు ఆ శాలువను పరీక్షించి, నేతను మెచ్చుకుని, నేతగాడికి మంచి బహుమానం ఇవ్వటమే గాక, మంచి ధర ఇచ్చి ఆ శాలువను తానే తీసుకున్నాడు. ఈ సంగతి పొరుగు గ్రామస్తుడైన రాఘవయ్య అనే వాడికి తెలిసింది. అతను గిన్నెలకూ, చెంబులకూ మాట్లువేసి జీవించేవాడు. అతను ఈ విధంగా తనలో అనుకున్నాడు :

"రాజుగారు అన్ని వృత్తి విద్యలనూ ప్రోత్సహిస్తున్నారు. ప్రతి వృత్తిలోనూ పనితనం చూపగలవాళ్లు తాము తయారుచేసిన వస్తువులను తీసుకుపోయి రాజుగారికి చూపించి, ఆయన మెప్పుపొంది, ఆయన దగ్గిర మంచిమంచి బహుమానాలు పొందుతున్నారు. కావటానికి నాది కూడా వృత్తి విద్యే. అందులో నేనుకూడా నేర్పరినే. కాని నేను ఏ వస్తువూ తయారుచేసేవాణ్ణి కాకపోతిని. నా పనితనం రాజుగారికి చూపి, ఆయన మెప్పుపొంది, బహుమానం పొందే మార్గమేమిటి? రాజుగారి గిన్నెలకూ, చెంబు

పళ్ళా సూరిబాబు

లకూ చిల్లులుపడితే అవతల పారేస్తారుగాని వాటికి మాట్లు వేయించుకోరాయె."

ఈ విధంగా ఆలోచించి రాఘవయ్య ఒక నిర్ణయానికి వచ్చాడు. రాజుగారికి తన పనితనం తెలియాలంటే రాజుగారు చూస్తూండగానే మాట్లు వెయ్యాలి.

అందుచేత రాఘవయ్య ఊరంతా తిరిగి మాట్లు వెయ్యవలిసి ఉన్న బిందెలూ, అండాలూ, డేగిశాలూ, గిన్నెలూ, చెంబులూ పోగుచేశాడు. వాటన్నిటినీ బండిమీద వేసుకుని తిన్నగా రాజుగారి కొలువుకు వెళ్లాడు.

"ఎవరు నీవు? ఏం కావాలి?" అని రాజుగారు రాఘవయ్యను అడిగాడు.

"మహారాజా, తమరు అన్ని వృత్తుల వారికీ బహుమానా లిచ్చి ప్రోత్సహిస్తున్నారు. నా వృత్తి మాట్లు వెయ్యటం. రేకుగిన్నె లయేది, పోత గిన్నె లయేది నేను మాటువేశానంటే ఎక్కడ చిల్లి ఉండినదీ ఎవరూ కనుక్కోలేరు. నేను మరమ్మతు చేసిన వస్తువు కొత్త వస్తువులా ఉండవలిసిందే. నా పనితనం ఎటువంటిదో తమకు చూపాలని చాలాదూరం వచ్చాను," అన్నాడు రాఘవయ్య.

"సరే, నీ పనితనం చూపు," అన్నాడు రాజుగారు. రాఘవయ్య ఆయన ఎదటనే



తాను తెచ్చిన బిందెలకూ, గిన్నెలకూ పెద్ద పెద్ద బొక్కలుపెట్టి, వాటికి మాట్లువేసి మెరుగుపెట్టి రాజుగారికి చూపించాడు.

రాజుగారు ఆశ్చర్యపోయాడు; వాడు మొదటవేసిన చిల్లుల ఆనవాలు కొంచెం కూడా తెలియటంలేదు. ఆయన రాఘవయ్యకు మంచి బహుమానం ఇచ్చి పంపేశాడు. రాఘవయ్య సామానంతా తీసుకుని పరమానందంతో తన గ్రామం చేరుకుని, ఎవరి సామాను వారికి ఇచ్చేశాడు.

రాఘవయ్య తను రాజుగారి ఎదట పెట్టిన కంతలకు మాట్లు వేశాడేగాని అంతకు ముందున్న చిల్లులూ, పగుళ్లూ

బాగుచెయ్యనే లేదు. అందుచేత అవన్నీ ఎప్పటిలాగే కారుతున్నాయి.

ఊళ్లోవాళ్లు రాఘవయ్య వద్దకు వచ్చి, "ఇదేమిటి, రాఘవయ్యా? మా సామాన్లు పట్టుకెళ్లినవి పట్టుకెళ్లినట్టే తిరిగి ఇస్తివి. అవన్నీ కారుతూనే ఉన్నాయి," అన్నారు. రాఘవయ్య రాజుగారి ప్రశంస పొందిన తన్మయత్వంలో ఉండటంచేత ఈ విమర్శ వినేసరికి మండిపడ్డాడు:

"ఓహో, నా పనితనానికి మీరా వంక పెట్టేవాళ్లు? నే నెటువంటి పనివాణ్ణో రాజుగారే స్వయంగా చూశారు. నేను మాట్లేసిన వస్తువు కొత్త వస్తువేనని రాజుగారికూడా అర్థమయింది. ఇకనుంచీ వారి సామాన్లకి నా చేతనే మాట్లు వేయించుకుంటారు!" అన్నాడు రాఘవయ్య.

"అదంతా మాకు తెలీదు. మా సామాన్లు సరిగా మాట్లు వేస్తావా, వెయ్యవా?" అని ఊళ్లోవాళ్లు అడిగారు.

"నా యిష్టమైతే వేస్తాను, లేకపోతే లేదు, మీ రెవరు నన్నడగటానికి?" అన్నాడు రాఘవయ్య.

"అయితే మరి మా సామాన్లెందుకు తీసుకుపోయావు? తీసుకుపోయినట్టే తిరిగి ఇవ్వటానికా?" అన్నారు ఊరివాళ్లు.

వారి మాటలను రాఘవయ్య లక్ష్యపెట్టలేదు. ఊరివాళ్లు రాజుగారి దగ్గిరికిపోయి రాఘవయ్య మీద ఫిర్యాదుచేశారు. రాజుగారు రాఘవయ్యను పిలిపించి, "మాట్లు వెయ్యటంలో పనితనంగలవాడివనీ, నీ వల్ల ప్రజలకు ఎక్కువ లాభం ఉంటుందనీ అనుకుని నీకు బహుమానం ఇచ్చాను. మీ ఊరివాళ్లకే ఉపయోగించని నీ పనితనం దేనికి? నీ కిచ్చిన బహుమానం తిరిగి ఇచ్చెయ్యి," అన్నాడు. ఆ మాటతో రాఘవయ్యకు బుద్ధివచ్చింది. అతను రాజుగారికి, క్షమాపణ చెప్పుకుని, ఆ నాటినుంచీ ఒళ్లు దగ్గిరపెట్టుకుని పనిచెయ్యసాగాడు.





# దక్షయాగ ధ్వంసము

ప్రథమాశ్వాసము

బ్రహ్మదేవు డొక యజ్ఞము
ప్రారంభము చేసినాడు;
ముల్లోకములం దుండిన
మును లచటికి చేరినారు.

ప్రమథులతో పరమశివుడు
బ్రహ్మ చెంత కూర్చుండెను;
కిటకిట మని యాగశాల
క్రిక్కిఱిసిన యట్లుండెను.

ఋత్విక్కుల వేదఘోష,
ఋషివర్యుల మంత్రధ్వని,
హోమాగ్నుల ధూమచ్ఛట
వ్యోమంబున కెగసినయవి!

హోమాగ్నుల వేల్చుచున్న
హోతల కను లెఱ్ఱవడెను;
పొగలవలన వారి వస్త్ర
ములు పూర్తిగ నల్లవడెను.

హోమకుండమం దగ్నులు
ఉవ్వెత్తుగ లేచుచుండె,
ఆహుతులను నాల్కలతో
అందుకొంచునట్లుండెను!

ఆ యజ్ఞము చూచుటకై
అరుదెంచెను దక్షుడపుడు;
మునులెల్లరు నతనికి కే
ల్మోగిచినారు సంభ్రమమున.

తండ్రివంటి వాడౌటను
దండం బిడడయ్యె బ్రహ్మ,
ధ్యాన మగ్నుడగుట శివుడు
దక్షుని పరికింపడయ్యె.

"తన యల్లుడు శంకరుండు
తా వచ్చిన లేవడయ్యె;
దండం బిడకున్న గాని
తనతో మాటాడడయ్యె.

ఉత్పల సత్యనారాయణాచార్య



అంత కొంత సేపటికిని
అతడు కోప మాపలేక,
దిగ్గున పీఠమ్ము నుండి
దిగి సదస్యు లదరి పడగ—

వ్రేలితోడ శివుని చూపి
"వీడు నాకు అల్లుండగు—"
అని నంతట పరమశివుడు
కనులు తెఱచి చూచినాడు.

"నే వచ్చినయపుడు మీరు
నిలబడి కేల్మొగిచినారు;
అల్లుండైయుండి కూడ
అతడు లేచి మ్రొక్కలేదు!

పుచ్చె బట్టి ఇంటింటను
బిచ్చ మెత్తుకొను వానికి
పిలిచి పిల్ల నొసగుటచే
చులకననై పోయినాడ!

వల్లకాడున తిరుగువానికి
వల్లమాలిన గర్వమేటికి?
తోళ్ళతునకలు తాల్చువానికి
ఒళ్ళు తెలియని పొగ రదేటికి?

తగుదునంచని బ్రహ్మ ప్రక్కన
తాను కూర్చొని కన్నుగానడు;
యజ్ఞమందున తనకు స్థానము
అబ్బెనంచును లక్ష్యపెట్టడు!

నలుగురిలో తలవంపులు
నా యల్లుడె కలిగించెను!
ఇచట నున్న పెద్దలలో
ఎవరికన్న నితడు గొప్ప?"

అని తలచుచు దక్షుడొక్క
ఆసనమున కూర్చుండెను;
లోపల నతనికి శివుపయి
కోపము పెల్లగుచుండెను.

చుఱచుఱమని శివుని వంక
చూడనట్లు చూచు నతడు—
గడ్డము సవరించుకొనుచు
కనుగొని తలయూచు నతడు.

ఒక్క శాపముతోడ నీతని
చక్కపరచెద చూడు," డంచును
ఇన్ని నీళ్ళుఅచేత గైకొని
ఇట్లు శాపం బిచ్చె దక్షుడు:

"ఇంద్రాదులతో సమముగ
ఈ శివుడును పొందుచున్న
యాగ హవిర్భాగమునకు
అర్హుడింక కాకుండుత!"

అని శపింప భృగుమహర్షి
తన గడ్డము సవరించుచు,
భళిభళి యని దక్షునపుడు
ప్రస్తుతించినాడు మిగుల.

పరమేశుని దక్షు డిట్లు
పరిభవించుచుండు నపుడు
శివశివ యని కొందఱచట
చెవులు మూసికొనియుండిరి.

తొందరపడి పరమశివుని
దూషించితివన కొందఱు,
తగిన శాప మిచ్చితివని
పొగడినారు మఱికొందఱు.

మునిజన వాదోపవాద
ములతో సభ రెచ్చిపోయె;
చిడిముడి పాటున దక్షుడు
ఛీ యని యటనుండి పోయె.

శివుడేమియు పలుకలేదు,
ఎవరిని కోపించలేదు;
నందీశుడు రోషముతో
నిందించుచు నిట్లు పలికె:

"ఓ సదస్యులార! మీరు
ఊరక కనుచుందురేల?
పరమేశుని దూషించిన
పాపాత్ముని విడుతురేల?



శివునకు తా మ్రొక్కవలెన?
శివుడె తనకు మ్రొక్కవలెన?
ఎదుటనున్న పరమేశుని
ఎఱుగలేని మూర్ఖు డతడు!

ఎంత చదువుకొన్న నేమి,
ఇంత తెలివి లేకుండగ
పరమేశుని నిందించిన
పాపాత్ముడు పశువాతడు!

ఆ కుత్సితు డికమీదట
మేక మొగముతో నుండుత!
ఆ మూఢుడు పశువువోలె
కామాతురుడై పోవుత!"

అని శపింప భృగుమహర్షి
కను లెఱ్ఱగ చేసినాడు;
చుఱచుఱమని నందీశుని
చూచి యిట్లు పలికినాడు:

"ఏమిటి తెగ ప్రేలుచుంటి?
మే మెవ్వర మనుకొంటివి?
నీ పాటిగ మేము గూడ
శాపం బిడ లేకుంటిమ?

శివుని గొల్చు వారల కిక
చిత్తశుద్ధి లేకుండుత!
పరమర్షుల దిట్టువారు
పాషండులుగా నుండుత!"

అని శపింప సభయెల్లెడ
హాహా ధ్వను లుప్పతిల్లె;
అవమానముతో శంకరు
డచటనుండి లేచిపోయె.

అటు పిమ్మట బ్రహ్మదేవు
డా యజ్ఞము పూర్తిచేసె;
మునులెల్లరు తమ యాశ్రమ
ములకు సాగి పోయినారు. —(సశేషం)






పూర్వం బ్రహ్మపురమనే నగరానికి సమీపానగల అరణ్యంలో కేశవుడన్నే కాపు యువకు డొకడు పశువులను మేపుకుంటూ వుండేవాడు. వాడికి తల్లి లేదు, ముసలి తండ్రి మాత్రం వున్నాడు. ఆ ముసలివాడు రోజూ ఉదయం పశువుల పాలుపిండి, వాటిని నగరంలో అమ్మి, ఆ వచ్చిన డబ్బులతో ఇంటికి అవసరమయిన వస్తువులు కొని తెస్తూండేవాడు.

కేశవుడూ, అతని తండ్రీ అరణ్యంమధ్య ఒక చిన్న పూరిపాకలో నివశిస్తూండేవారు. వారున్న ప్రాంతానికి దాపులలో ఎక్కడా గ్రామాలులేవు. వాళ్ళు వుంటున్న అరణ్యం చుట్టూతా పెద్ద పెద్ద కొండలుండేవి. కేశవుడు రోజూ తన పశువులమందను కొండ దరికి తోలుకుపోయి, అక్కడవున్న పచ్చిక బీళ్ళలో వాటిని మేపుతూండేవాడు. అలాంటి సమయాల్లో అతడికి కొండ పైభాగానికి ఎక్కి చూడాలనిపించేది. కాని, తండ్రి అతణ్ణి కొండ ఎక్కవద్దని ఏనాడో శాసించాడు. కారణ మేమంటే; ఆ కొండమీది గుహల్లో పెద్ద పెద్ద సర్పాలూ, పులులూ, ఎలుగుబంట్లూ వుంటవని అతడి నమ్మకం.

ఒకనాడు పశువులను పచ్చికబీటి వైపుకు తోలి, కేశవుడు ఒక చెట్టు నానుకుని కూచుని విల్లంబులు తీసుకుని, బాణాలను దూరంగా వున్న అడివిచెట్ల బోదెలకూ, కొమ్మలపైన వున్న పక్షులకూ గురిచేసి వదులుతున్నాడు. వాడావిధంగా విలు విద్యాభ్యాసంలో మైమరచి వుండగా, కొండ పాదంలోని




రాతిఖండల వైపునుంచి ఒక వికృతమైన ధ్వని వినిపించింది. కేశవుడు భయంవల్ల కంపించిపోయి, అంతలోనే గుండె నిబ్బరం తెచ్చుకుని, ఆ వికృతధ్వని వచ్చినవైపుకు కళ్ళుతిప్పాడు. చూస్తూండగానే ఒక వింత జంతువు అక్కడ ఎత్తుగావున్న ఒక రాతి మీదికి ఛెంగున ఎగిరి నిలబడింది. దాని ఆకారం గుఱ్రాన్ని పోలివున్నది. కాని శరీరం మీద అడవి గాడిదలకు వున్నట్టుగా పెద్ద చారలున్నాయి. ముఖాన పొడవైన ఒకే ఒక కొమ్ము వున్నది.

ఈ వింత జంతువును చూసి కేశవుడు తబ్బిబ్బయిపోయాడు. ఇలాంటి జంతువు



లోకంలో వుంటుందనయినా వాడు ఎన్నడూ వినలేదు. ఇప్పుడేంచేయాలి? బాణం ఎక్కుపెట్టి దాన్ని గురిగా కొట్టగలిగితే బావుండును. ఆ వింతమృగం రాతిమీద నిలబడి తోకతో శరీరాన్ని దులుపుకుంటూ, మెడ మీది పెద్ద జూలును ఎగరవేస్తూ కేశవుడికేసి తల తిప్పింది. ఇదే మంచి అదనను కుంటూ కేశవుడు వింటితాటిని చెవివరకూ లాగి, ఒక బాణాన్ని దాని మీదికి వదిలాడు. బాణం ఝుం అంటూ వచ్చి శరీరాన్ని తాకే లోపల ఆ వింత జంతువు రాతిమీది నుంచి ఎగిరి పక్కకు దూకేసింది. కేశవుడు ఆశ్చర్యపడుతూ మరోబాణాన్ని వింటికి తగిలించబోయేంతలో, అది వాయువేగ మనోవేగాలతో దూకుతూ వచ్చి, కేశవుడి చేతిలో వున్న విల్లంబులను నోటపట్టి దూరంగా విసిరివేసింది.

తనకు ప్రాణాపాయం కలగనున్నదని కేశవుడు భావించాడు. ఆ క్షణంలోనే అతడికి ఎక్కడలేని తెగింపూ కలిగింది. అతడు చెట్టుకు ఆనించి వున్న తన చేతి కఱ్ఱను అందుకోబోయేలోపల, ఆ వింత జంతువు అవుకన్నకూడా సాధువులా తలాడిస్తూ వచ్చి, ముట్టెను అతడి భుజం మీద పెట్టింది.








కేశవుడు మరింత ఆశ్చర్యపడ్డాడు. ఈ వింతజంతువుకు మానవుల మనోగతాభిప్రాయాలు తెలుసుకునే దివ్యజ్ఞానం వున్నదేమో అనిపించిందతడికి. ఏది ఏమైనా, ఈ వింతజంతువు వాలకం చూస్తూంటే, అది తనకు హాని చేసేదిగా కనబడలేదు. ఆ కారణంవల్ల కేశవుడు ఉత్సాహంగా లేచి నిలబడి, దాని వెన్నుమీద అరిచేతితో గట్టిగా చరిచాడు. దానితో ఆ వింత మృగం గుర్రంలా కాళ్ళతో కదను తొక్కుతూ, తల పైకెత్తి పెద్దగా సకిలించింది.

"ఇది బహుశా గుర్రం జాతికి చెందిన జంతువై వుండొచ్చు," అనుకున్నాడు కేశవుడు. ఆ అభిప్రాయం అతడికి కలగగానే, దానిమీద స్వారి చేయాలన్నకోరిక కలిగింది. ఆ వెంటనే అతడు ఎగిరి దాని వీపుమీద కూచున్నాడు.

వింతజంతువు ఈసారి మరింత పెద్దగా సకిలించి, చిన్న చిన్న అడుగులు వేస్తూ కొండకేసి బయలుదేరింది. కళ్ళెం, జీనూ లేకుండానే దీనిమీద స్వారి చేయవచ్చు, అనుకున్నాడు కేశవుడు. కొండను సమీపిస్తున్నకొద్దీ దాని వేగం క్రమంగా హెచ్చసాగింది. కేశవుడు కింద పడబోయేవాడల్లా దాని జూలు పట్టుకుని ముందు కొరిగాడు. అదే సమయంలో అది బంతిలా ఎగిరి ఒక బండరాయి మీదికి ఎక్కింది. కేశవుడు భయపడిపోయాడు. "ఓహో, ఇది, నన్ను కొండమీదికి తీసుకుపోవాలని చూస్తున్నది. అక్కడి గుహల్లో పులులూ, ఎలుగుబంట్లూ...ప్రమాదం!" అనుకుంటూ అతడు దానిమీది నుంచి కిందికి దూకేశాడు. కేశవుడు కిందికి దూకగానే, వింత జంతువుకూడా రాతిమీది నుంచి కిందికి దూకి, అతడి చుట్టూ కదను తొక్కుతూ గిర్రున తిరగసాగింది. కేశవుడికి ఏమి చేయాలో తెలియలేదు. వాడు కాళ్ళీడ్చుకుంటూ మామూలుగా కూచునే చెట్టు





కేశవుడు యిలాంటి ఆలోచనల్లో తల మునకలైవుండగా, వింత జంతువు వాడి పశువుల మందలోకి వెళ్ళి, వాటితోపాటు పచ్చిగడ్డి మేయసాగింది. మొదట్లో, దాన్ని చూసి బెదిరిన ఆవులు క్రమంగా భయం పోయి, దానితోపాటు కలిసి తిరగసాగాయి. ఆ సాయంత్రం వరకూ తన ఆవులమందలో వుండి, సూర్యాస్తమయ సమయంలో, ఆ వింత జంతువు తిరిగి కొండమీదికి వెళ్లి పోతుందనుకున్నాడు, కేశవుడు. కాని, అలా జరగలేదు. చీకటి పడుతూండగా వాడు మందను ఇంటికి మళ్ళించుకు వచ్చేటప్పుడు, అదికూడా వాటితోపాటు వాడి పూరిపాక దగ్గరకు వచ్చింది. కేశవుడు పశువులన్నిటినీ ఒకచోటికి చేర్చి, వాటి చుట్టూ నెగడు వేసి పాకలోకి వెళ్ళి పోయాడు. ఈ వింత జంతువు సంగతి తన తండ్రితో చెప్పటమా? మానటమా? అని ఆలోచిస్తూనే, వాడు ఆ రాత్రి భోజనంచేసి హాయిగా నిద్రపోయాడు.

మర్నాడు తెల తెల్లవారుతూండగానే తండ్రి కేశవుడి మంచం దగ్గిరకు వచ్చి, వాణ్ణి భుజంపట్టుకుని కుదుపుతూ, "కేశవా, లేలే! ఎంత ప్రమాదం జరిగిపోయింది! రాత్రి మన మందలోకి ఒక తోడేలు

వద్దకు వెళ్లాడు. వింతజంతువు కూడా అతడికి వెనకగా అక్కడికి చేరింది.

కేశవుడు ఆలోచనలోపడ్డాడు. ప్రపంచంలోమాట ఏమోగాని, తను వుంటున్న రాజ్యంలో మటుకు ఇలాంటి జంతువు వున్నట్టు తను ఎన్నడూ వినలేదు. అది కొండ మీది నుంచి తను వున్నచోటుకు వచ్చింది. తను స్వారిచేయాలని ప్రయత్నిస్తే తనను కొండమీదికి తీసుకుపోవాలని ప్రయత్నించింది. అంటే, దాని నివాసస్థానం కొండ మీద ఎక్కడో వుండి వుంటుంది. దీనిని పట్టుకుపోయి బ్రహ్మపురంలో అమ్మితే తనకు చాలా ధనం రావచ్చు!





వచ్చింది. చుట్టూ నెగళ్ళ వెలుగువున్నా అదెట్లా లోపలికి వచ్చిందో నాకు తెలియటం లేదు," అన్నాడు అదుర్దాగా.

కేశవుడు ఉలిక్కిపడి లేచికూచున్నాడు. వాడికి చప్పున క్రితంరోజు ఆవులమంద దగ్గరకు వచ్చిన వింత జంతువు గుర్తుకొచ్చింది. తండ్రి దాన్ని చూసి తోడేలనుకుంటున్నాడా? అతడికి పెద్దతనం వల్ల బాగా చూపు ఆనకపోయినా, గుర్రం అంత ఎత్తున్న ఆ వింత జంతువును చూసి తోడేలని ఎలా అనుకోగలడు? ఒకవేళ ఆ వింత జంతువే రాత్రి వేళ తోడేలుగా మారి తన ఆవుల్ని చంపి తిని పారిపోయిందేమో!

"ఆ తోడేలు ఎన్ని ఆవుల్ని పొట్టన పెట్టుకున్నది?" అని అడిగాడు కేశవుడు తండ్రిని.

"దేవుడి దయవల్ల అలాంటిదేమీ జరగలేదు. తోడేలు నన్ను చూస్తూనే నెగళ్ల మంట మీదిగా దూకి అడవిలోకి పారిపోయింది," అన్నాడు తండ్రి.

కేశవుడు ఒక పెద్ద నిట్టూర్పు విడిచి, "నువు చూసింది తోడేలు కాదేమో! నిన్న సాయంకాలం మందలోకి కొండ మీదినుంచి ఒక వింతజంతువు వచ్చింది," అంటూ తండ్రికి దాన్ని గురించి అంతా వివరంగా చెప్పాడు. అంతా విని తండ్రి ఆశ్చర్య




పడుతూ, "నువ్వు చెప్పిన వింతజంతువేదీ నాకు మందలో కనిపించలేదే! కొండమీంచి వచ్చిందంటున్నావు, జాగర్త! అది జంతు రూపంలో వున్న ఏ మాయావి రక్కసయినా కావొచ్చు!" అన్నాడు.

తండ్రి మాటలకు కేశవుడు బిగ్గరగా నవ్వుతూ, "రక్కసైతే నన్ను పట్టుకు పోయేందుకు ఆ రూపంలోనే రావొచ్చుగా, ఈ వింత రూపం ఎందుకు ధరించాలి? నువ్వు చూసింది నిజంగానే తోడేలు, సందేహం లేదు. మంద వెంట మన ఇంటికి వచ్చిన వింతజంతువు రాత్రికిరాత్రే అడవి లోకి వెళ్ళిపోయివుంటుంది," అన్నాడు.



తరవాత తండ్రి పాలకావిడి ఎత్తుకుని నగరంకేసి వెళ్ళిపోయాడు. కేశవుడు ఆదరా బాదరా ముఖం కడుక్కొని, స్నానం చేసి చద్ది అన్నం తిని మందను కొండదరి పచ్చిక బీడులోకి తోలుకు పోయేందుకు పాకలోంచి బయిటికి వచ్చాడు. అవుల్లో కొన్ని నెమరు వేస్తూ పడుకొనివున్నాయి, కొన్ని అంభా అని అరుస్తూ గంతులు వేస్తున్నాయి. కాని, ఎక్కడా వింతజంతువు జాడలేదు.




కేశవుడు అవుల మందను కొండదరికి తోలుకుపోయి, తను మామూలుగా కూచునే చెట్టు కింద కూచుని, బాణాలు ఎక్కుపెట్టి కొండ మీదికి ఝూం ఝూం అని ప్రతి ధ్వనించేలా వదులుతున్నాడు. హఠాత్తుగా అతడి వెనక వింతజంతువు వికృతంగా సకిలించిన శబ్దం వినబడింది. కేశవుడు తుళ్ళిపడి వెనక్కు తిరిగి చూశాడు. వింత జంతువు వెనకకాళ్ళమీద లేచి నిలబడి మరింత పెద్దగా సకిలించి, అతడి ముందుకు వచ్చి నిలబడింది.

"మళ్ళీ వచ్చావా? నీమాట మరచి పోయాను సుమా?" అన్నాడు కేశవుడు, మనిషితో మాట్లాడుతున్న ధోరణిలో. వింత జంతువు తలాడించింది. కేశవుడి ఆశ్చర్యానికి అంతులేదు. అంతలోనే అతడికి తండ్రి మాటలు గుర్తు కొచ్చినై. "ఇదేదైనా మాయ రక్కసి కాదుగదా?" అనుకున్నాడు మనసులో. అతడి మనోగతభావాలు అర్థమైనదానిలా వింతజంతువు గిరుక్కున వెను దిరిగి అవుల మందకేసి బయలుదేరింది. కేశవుడు దానికేసి కొంచెంసేపు అనుమానంగా చూసి, విసుక్కుంటూ, అంబుల పొదిలోంచి బాణాలు తీసి ఎక్కుపెట్టి, ఈసారి చెట్లకొమ్మల మీదికి వదలసాగాడు.

ఈ విధంగా కొద్దికాలం గడిచింది. దూరంగా ఎక్కడో గుర్రాలు పరిగెత్తి వస్తున్న చప్పుడయింది. చూస్తూండగానే ఇద్దరు రౌతులు కేశవుడున్నచోటుకు వచ్చి,



అతడికేసి వింతగా చూస్తూ, "మహాసేనానీ, ఇక్కడెవ్వడో ఏకలవ్యుడున్నట్టుంది!" అని కేక పెట్టారు.

"ఏకలవ్యుడా? అయితే ఆలశ్య మెందుకు, వేళ్ళు తెగ్గొట్టండి!" అంటూ విలువైన దుస్తులతో, బాగా అలంకరింప బడిన గుర్రాన్నెక్కి వున్న ఒకడు అక్కడికి వచ్చాడు.

"ఏమిరా ఆ పొగరు! లేచి నిలబడవేం? ఈ వచ్చింది ఎవరనుకున్నావ్? బ్రహ్మపుర మహాసేనాని!" అన్నాడొక రౌతు.

కేశవుడు చప్పున లేచి నిలబడి, బ్రహ్మపురసేనానికి, చేతులెత్తి నమస్కారం చేశాడు. సేనాని అతణ్ణీ, చెట్టుకింద వున్న అంబుల పొదినీ, ధనువునూ పరీక్షగా చూసి మీసం దువ్వుకుంటూ, "ఏరా, నువ్వెవరివి? క్షత్రియుడివా? ఎవరి ప్రాణాలు తీయాలని, ఈ ధనుర్విద్య నేర్చుతున్నావ్?" అని కఠినంగా ప్రశ్నించాడు.

"అయ్యా, నేను కాపుకుర్రాణ్ణి. నాకీ లోకంలో శత్రువులెవరూ లేరు. ఏదో ఉబుసుపోక ఈ విల్లంబులు వెంట తెచ్చుకున్నాను. అదుగో, ఆ కొండ దరిని నా ఆలమంద!" అన్నాడు కేశవుడు వినయంగా.

సేనాని తల తిప్పి ఆలమందకేసి చూసే లోపలే, గుర్రపు రౌతుల్లో ఒకడు గగ్గోలు పడుతున్నట్టు గొంతెత్తి, "మహాసేనానీ, చూడండి, చూడండి! పంచకల్యాణి! దేవతాశ్వంలా వున్నది!" అంటూ వింతజంతువుకేసి చేపెత్తి చూపాడు.

సేనాని ఆశ్చర్యపడుతూ ఆ వింత జంతువుకేసి ఓక్షణకాలం చూసి, "అది పంచకల్యాణీ కాదు, దేవతాశ్వమూ కాదు; అడివిగాడిదలా వున్నది! అడివిగాడిద అంత ఎత్తు వుండదే! ఒంటి కొమ్ము ఏమిటి? ఇలాంటి జంతువు వుంటుందని విననైనా వినలేదే! ఇటు మళ్ళించుకురండి!" అని భటులకు ఆజ్ఞయిచ్చాడు.—(ఇంకా వుంది)






# మారిపోయిన పెళ్లికూతురు

కోసలరాజుకు కొడుకైన కమలాకరుడనే వాడు అందానికి నవమన్మధుడు. ఆ నగరం లోనే ఒక భద్రాజుండేవాడు. ఆ భద్రాజు దేశాటనచేస్తూ విదిశానగరానికి వెళ్ళి ఒక నాట్యాచార్యుడి ఇంట అతిథిగా ఉన్నాడు.

ఒకనాడా నాట్యాచార్యుడు భద్రాజుతో, "రేపు రాజసభలో రాజకుమార్తె నేను చెప్పిన కొత్తనాట్యం ప్రదర్శించబోతున్నది," అని చెప్పాడు. ఆ నాట్యం చూడాలని వేడుకపుట్టి భద్రాజు నాట్యాచార్యుడి వెంట రాజసభకు వెళ్ళి కూచున్నాడు. రాజ కుమార్తె హంసావళి సభకు వచ్చి కొత్త నాట్యం ప్రారంభించింది.

అందంలో రంభా ఊర్వశీలను తలదన్నే హంసావళిని చూడగానే భద్రాజు, "అహా, ఈ పిల్లను మా రాజకుమారుడు కమలా కరుడు చేసుకుంటే ఎంత బాగుండును!" అనుకున్నాడు.

భద్రాజు చాలా గడుసువాడు. ఈ ఆలో చన తట్టినమీదట ఇందుకుగాను తానే స్వయంగా పాటుపడాలనుకున్నాడు. దానికి మొదటిమెట్టుగా తాను రాజభవనంలో ప్రవే శించాలి. అందుకుగాను అతను ఏంచేశా డంటే, సభ ముగిసేలోపల ఒక గుడ్డమీద, "సమర్థులుంటే నాతో సమంగా చిత్రరువులు చిత్రించవచ్చు," అని రాసి, దాన్ని పక్కన పెట్టుకుని రాజద్వారం దగ్గిర కూచున్నాడు.

ఈ సంగతి తెలిసి రాజుగారు, వీడెవడో గొప్ప చిత్రకారుడనుకుని, తన కుమార్తె ఇంటి గోడలపై చిత్రాలు రచించటానికి భద్రాజును నియోగించాడు. భద్రాజు హంసావళి పడకగది గోడమీద కమలా కరుణ్ణీ అతని పరివారాన్నీ చిత్రించాడు.

కాని ఆ బొమ్మలో చిత్రించినవాడు ఫలానా రాజకుమారుడని తానై చెబితే మోసం చేస్తున్నాడని రాజకుమార్తె అనుకో

సి. మాధవరావు



వచ్చు. హంసావళి తానై ఆ బొమ్మ ఎవరిదని అడగలేదు. అందుచేత భట్రాజు ఇంకొక యుక్తి చేశాడు; నమ్మకస్తుడైన మిత్రుణ్ణి ఒకణ్ణి సహాయంకోరి, వాడికి ఏం చెయ్యాలో ముందుగా బోధించాడు.

భట్రాజు మిత్రుడు వెర్రిబాగులవాడిలాగా నటిస్తూ రాజభవనం వద్దకు వచ్చి రాజకుమారులను కాస్సేపు నవ్వించాడు. ఇది తెలిసి హంసావళి వాణ్ణి తన భవనానికి పిలిపించింది. వాడు రాజకుమార్తె గది గోడమీద భట్రాజు వేసిన బొమ్మ చూస్తూనే, "ఇదేమిటి? కోసల రాజకుమారుడు కమలాకరుడు ఇక్కడికెలా వచ్చాడు! అహో, అతను ఎంత అందగాడు! అటువంటి అందగాడు భూప్రపంచంలో మరొకడు లేడు గదా!" అన్నాడు.

"ఇదేమిటి, ఈ వెర్రివాడు ఇలా అంటున్నాడు?" అని హంసావళి భట్రాజును అడిగింది.

"వాడు చెప్పేది నిజమేనమ్మా! వీడెప్పుడో ఆ రాజకుమారుణ్ణి చూసి ఉంటాడు. అందుచేతనే బొమ్మ చూసి పోల్చగలిగాడు," అని భట్రాజు చెప్పాడు.

ఆ మాటతో హంసావళి మనసులో కమలాకరుడిపై ప్రేమ మొలకెత్తి దినదిన ప్రవర్ధమానం కాసాగింది.

తన పని ఈవిధంగా ఇక్కడ ముగించుకుని భట్రాజు కోసలనగరానికి వెళ్ళి, యుక్తిగా రాజకుమారుడితో ఈ జరిగిన సంగతంతా చెప్పేశాడు. దాంతో కమలాకరుడికి హంసావళిపై ప్రేమ అంకురించి దినదిన ప్రవర్ధమానం కాసాగింది.

ఇది జరిగిన కొద్ది కాలానికే కమలాకరుడితో తండ్రి, "నాయనా, ఈడు వచ్చినవాడవు; అస్తమానం ఇంట్లో కూచుని సుఖాలు అనుభవించకపోతే మన శత్రువులను జయించి రారాదా? అంగరాజు మనతో యుద్ధానికి అయత్తుడవుతున్నాడట.

సైన్యం తీసుకుపోయి ఆ అంగరాజును ఓడించు," అన్నాడు.

విదిశకు వెళ్ళటానికి ఇది మంచి అవకాశంగా దొరికింది. అందుచేత కమలాకరుడు తండ్రి మాటప్రకారం అంగదేశం పైకి దండెత్తి వెళ్ళాడు; అంగరాజుతో యుద్ధం చేసి ఓడించటమేగాక రాజును ప్రాణాలతో బందీగా పట్టుకుని భటుల కిచ్చి తండ్రి వద్దకు పంపుతూ, "నేను మన ఇతర శత్రువుల నందరినీ జయించిగాని తిరిగి రాను," అని కబురు చేశాడు.



తరవాత కమలాకరుడు దారిలో తగిలిన దేశాలన్నిటినీ జయిస్తూ, తన సేనను అంతకంతకూ పెంచుకుంటూ కాలక్రమాన విదిశానగరం చేరి ఊరిబయట విడిసి రాజుగారి వద్దకు ఒక దూతను పంపాడు.

కోసల యువరాజు వరసగా ఒక్కొక్క దేశాన్నే జయించుకుంటూ వస్తున్నవార్త హంసావళి తండ్రి అదివరకే విన్నాడు.

ఆ యువరాజు ప్రచండమైన సేనతో తన నగరానికే వచ్చాడనే సరికి ఆయన బెదిరిపోయాడు.

కాని కమలాకరుడి దూత ఆయన వద్దకు వచ్చి, యుద్ధం గురించి మాట్లాడటానికి మారుగా, "మా కమలాకర యువరాజుగారు మీ అమ్మాయిని హంసావళిని తమకిచ్చి వివాహం చెయ్యమని కోరుతున్నారు," అన్నాడు.

హంసావళి తండ్రికి పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. ఆయన వెంటనే కమలాకరుణ్ణి చూడబోయి, "నాయనా, కాకిచేత కబురుచేస్తే అయిపోయేదానికి నీవే వచ్చావా? నా కుమార్తెకు నీ కంటె తగిన వరుడు ఎక్కడ దొరుకుతాడు. నా కుమార్తె మహిమగలది. పసితనం నుంచీ విష్ణువు నారాధించటంవల్ల ఎలాటి జ్వరాన్నయినా ఆమె తాకి పోగొట్టకలదు. ఇది నాకే స్వయంగా అనుభవం," అన్నాడు.



ఆయన అప్పుడే తన కూతురి పెళ్ళికి లగ్నంకూడా నిర్ణయించి తన ఇంటికి వెళ్ళిపోయాడు. తనకూ కమలాకరుడికీ పెళ్ళి నిశ్చయమయిందంటే హంసావళి నమ్మలేకపోయింది. తాను ఎవరిని పెళ్ళాడాలని ఇంతకాలంగా కలలు కంటున్నదో అతడే తనకు దైవికంగా భర్తకావటం సాధ్యమా? ఈ పెళ్ళికొడుకు తన గదిగోడమీద చిత్రించినవాడా, లేక అదే పేరుగల మరొక రాజకుమారుడా? అతడి వెంట పెద్ద సేన ఉండటంచూసి తన తండ్రి దడుచుకుని తనను వాడికివ్వటానికి ఒప్పుకున్నాడేమో! ఈ అనుమానాలు హంసావళిని బాధించాయి.

హంసావళికి కనకమంజరీ, అశోకకరిక అని ఇద్దరు ఇష్ట సఖులున్నారు. ఆమె కనకమంజరితో రహస్యంగా, "ఓసీ, నీవు ఆ రాజకుమారుడి వద్దకు వెళ్ళి, అతను నా గది గోడమీద చిత్రించిన కమలాకరుడో కాదో సరిగా తెలుసుకురా!" అని చెప్పింది.

కనకమంజరి గడ్డాలూ, మీసాలూ, కాషాయవస్త్రాలూ, రుద్రాక్షమాలలూ, జింకతోలూ మొదలైనవి సంపాదించి యతివేషం వేసుకుని కమలాకరుడుండే విడిదికి వెళ్ళి అతనిచేత మర్యాదలు చేయించుకున్నది. కాని అతన్ని చూడగానే కనకమంజరికి మోహం ఆవేశించి, ఎలాగైనా తానే అతన్ని పెళ్ళాడాలన్న దుర్బుద్ధి పుట్టింది.

అందుచేత కనకమంజరి ఇంటికి తిరిగి వచ్చి హంసావళితో, "సఖీ, నీవు నిజంగా ఎంత దురదృష్టవంతురాలివి! నేను వెళ్ళే సరికి నీ కాబోయే భర్తను తాళ్ళతోబంధించి బలవంతాన ఏదో మందులిస్తున్నారు. అతనికి దయ్యం పట్టింది. నన్ను చూడగానే భూతవైద్యం చాతనవునా అని అడిగారు. నేనేదో రక్షకట్టి, మళ్ళీ వస్తానని వాళ్ళతో చెప్పి వచ్చేశాను. మహారాజుగారు నీకు మొత్తానికి మంచి సంబంధమే కుదిర్చారు!" అన్నది.

ఈ మాటలు వినగానే హంసావళి బెదిరి పోయి, "సఖీ, ఈ పెళ్ళి తప్పించుకోవటం ఎలా?" అని కనకమంజరిని అడిగింది.

"మనం ఒక యుక్తి చేస్తే ఈ పెళ్ళి నీకు తప్పుతుంది. మరొకతెకు నీ వేషం వేసి పెళ్ళి పీటలమీద కూచోబెట్టి మనిద్దరమూ అరణ్య మార్గానపడి పారి పోదాం!" అన్నది కనకమంజరి.

"మరెవరో దేనికి? ఆ పెళ్ళికూతురి వేషం నీవే వేసుకో. నేను ముందుగానే అరణ్యంలోకి వెళతాను. తరవాత నీవు కూడా తప్పించుకుని వచ్చి నన్ను కలుసుకో!" అన్నది హంసావళి. ఈవిధంగా అమె కనకమంజరి తన కోసం తవ్విన గోతిలో సూటిగా పడింది.

పెళ్ళిరోజు వచ్చింది. హంసావళి గదిలో అమెతోబాటు కనకమంజరీ, అశోకకరికా మాత్రమే ఉన్నారు. కనకమంజరి పెళ్ళి కూతురి వేషం వేసుకున్నది. హంసావళి అమె దుస్తులు ధరించింది.

కనకమంజరి హంసావళితో, "సఖీ, ముహూర్తం సమీపిస్తున్నది. నీవు పడమటి ద్వారంకుండా వెళ్ళి ఒక కోసుదూరం వెళ్లా వంటే అక్కడ ఒక పెద్ద బూరుగు చెట్టున్నది. దానిలో పెద్ద తొర్రఉన్నది. అందులో దాగి



ఉండు. త్వరలోనే నేను వచ్చి నిన్ను కలుసుకుంటాను," అని చెప్పింది.

రాత్రి సమయం. హంసావళి చీకటిలో ఎవరి కంటా పడకుండా పడమటి ద్వారం దాటి కోసుదూరం నడిచి కనకమంజరి చెప్పిన బూరుగుచెట్టు దగ్గిరికి వచ్చింది. కాని ఆ చీకటిలో ఆ చెట్టు తొర్రలో దూరి దాక్కోవటానికి అమెకు అసహ్యంవేసి, దాని సమీపంలోనే ఉన్న మర్రిచెట్టొకటి ఎక్కి కనకమంజరి రాకకోసం ఎదురు చూడసాగింది.

అక్కడ కనకమంజరి అశోకకరికతో, "రాజకుమార్తెకు ఈ సంబంధం ఇష్టంలేక




ఈ దొంగ ఎత్తు వేశాం. నీవు నా రహస్యం దాచావంటే నా వెంట తీసుకుపోయి ఎంతో మేలు చేస్తాను," అని నచ్చచెప్పింది.

తరవాత పెళ్ళికూతుర్ని పిలుచుకుపోయారు. కనకమంజరి మేలిముసుకు వేసుకుని ఉండటంవల్లా రాత్రివేళ కావటం వల్లా ఆమె హంసావళి కాదని ఎవరూ పోల్చలేదు.

కమలాకరుడు హంసావళిని పెళ్ళాడుతున్నాననుకుంటూ కనకమంజరిని పెళ్ళాడాడు. వెంటనే అతను తన భార్యతోనూ పరివారంతోనూ తన దేశానికి బయలుదేరాడు. భార్యాభర్తలు ఎక్కిన ఏనుగు



పడమటి ద్వారం దాటి, హంసావళి వెళ్ళిన దారినే నడుస్తూ బూరుగు చెట్టు దగ్గిరికి వచ్చింది. కనకమంజరి దడుచుకున్నదానిలాగా అయిపోయి కమలాకరుణ్ణి గట్టిగా పట్టుకున్నది.

"ఎందుకలా భయపడుతున్నావు?" అని కమలాకరుడు అడగగా, కనకమంజరి, "నిన్న రాత్రి నాకొక పీడకల వచ్చింది. అందులో నేనీ బూరుగు చెట్టు దగ్గిరికి వచ్చినట్టూ, అందులోనుంచి ఒక పిశాచి వచ్చి నన్ను పట్టుకుని మింగబోయినట్టూ, అంతలో ఒక బ్రాహ్మడు నన్ను కాపాడి, పిశాచితో సహా ఈ బూరుగు చెట్టును తగలబెట్టమన్నట్టూ వచ్చింది. ఈ చెట్టును ఇప్పుడు చూడగానే నాకా పాడు కల జ్ఞాపకం వచ్చి భయం వేసింది," అన్నది.

ఈ మాట విని కమలాకరుడు తన భటులతో, "ఈ బూరుగు చెట్టును కాల్చివేయండి," అన్నాడు. "ఆ చెట్టులోనుంచి పిశాచి బయటికివస్తే దాన్నికూడా ఆ మంటల్లోనే వెయ్యండి!" అన్నది దుర్మార్గురాలైన కనకమంజరి.

బూరుగుచెట్టు కాలి బూడిద అయినాక కనకమంజరి తనకు హంసావళి పీడ శాశ్వతంగా విరగడ అయిపోయిందనుకుని సంతో





షించింది. కమలాకరుడు ఆమెతో తన నగరానికి వెళ్ళి, తండ్రిచేత రాజ్యాభిషేకం కూడా చేయించుకుని, కనకమంజరిని పట్టపుదేవిని చేసుకుని సుఖంగా రాజ్యమేలుతున్నాడు.

కనకమంజరి చేసిన ద్రోహం మర్రిచెట్టు పైనుంచి కళ్ళారాచూసి, చెవులారా విన్న హంసావళి తన దుర్దశకు దుఃఖించింది. ఆ భూరుగు చెట్టు మంటలోనే ఆత్మహత్య చేసుకుందా మనికూడా ఆమె అనుకున్నది, కాని చచ్చి సాధించే దేమిటి అనుకుని ఆ ప్రయత్నం మానేసి జనుల కంట పడకుండా నిర్జనారణ్యాల వెంబడి వెళ్ళివెళ్ళి, ఒక ఫలవృక్షాల వనంచేరి, అక్కడ తన ఇష్టదైవమైన విష్ణువును ఆరాధిస్తూ, పళ్ళే ఆహారంగా తాపసి జీవితం వెళ్ళబుచ్చ సాగింది.

ఇంతలో కమలాకరుడికి విడవని జ్వరం పట్టుకుని ఎన్ని చికిత్సలు చేసినా పోలేదు. ఈ జ్వరంచూసి కనకమంజరి బెదిరి పోయింది. తాను హంసావళిలాగా నటిస్తున్నది. హంసావళి తాకితే ఏ జ్వరమైనా పోతుందని కమలాకరుడు తన మామగారి ద్వారా విని ఉన్నాడు, కాని అతను ఆ సంగతి మరిచిఉండాలి. అది జ్ఞాపకం వచ్చేలోగా ఈ జ్వరం నిమ్మళించకపోతే తాను మాయా హంసావళి అన్నసంగతి బయటపడుతుంది.

అసలే ఆమె తన రహస్యాన్ని తన వెంట ఉన్న అశోకకరిక ఎప్పుడు బయటపెట్టేస్తుందో అని మథనపడుతున్నది. ఒక్క దెబ్బతో అశోకకరిక ప్రాణాలనూ, కమలాకరుడి జ్వరాన్నీ పోగొట్టటానికి కనకమంజరి ఒక ఎత్తు వేసింది.

ఒకరాత్రివేళ ఆమె అశోకకరికను వెంట బెట్టుకుని ఒక పాడుబడిన శివాలయానికి వెళ్ళి, అక్కడి లింగానికి మేకను బలి ఇచ్చి, మేక కళ్ళతో దూపం వేసింది.

తరవాత ముగ్గువేసి అందులో జ్వరపురుషుడి బొమ్మ వేసి దానికి సాష్టాంగ పడమని అశోకకరికను కోరింది. కనకమంజరి తలపెట్టిన ద్రోహం తెలియక అశోకకరిక సాష్టాంగ పడింది. వెంటనే కనకమంజరి కత్తి ఎత్తి దాని మెడమీద వేసింది.

అయితే ఆ దెబ్బ అశోకకరిక మెడకు తగలక ఆమె భుజానికి తగిలి కొద్ది గాయమయింది. ఆమె పెద్దపెట్టున కేకలు పెడుతూ బయటికి పరిగెత్తింది. ఈ కేకలు విని తలారివాళ్ళు పరిగెత్తుకుంటూ వచ్చారు. అశోకకరిక మూలంగా గుడిలో ఉన్న కనకమంజరినీ, గుడి లోపలి దృశ్యాన్నీ, ఆమె తలపెట్టిన నరబలినీ అర్థం చేసుకుని, కనకమంజరిని చాప చితకగొట్టి కొత్వాలు దగ్గిరికి ఈడ్చుకుపోయినారు. అయితే కమలాకరుడు నేరవిచారణ చేసే లోపలే కనకమంజరి తాను తిన్న దెబ్బల ఫలితంగా చనిపోయింది.

కనకమంజరి చేసిన దుర్మార్గమంతా అశోకకరిక ద్వారా విన్నాక హంసావళి జీవించే ఉన్నదని కమలాకరుడికి అనిపించింది. ఆమె చెట్టుతొర్రలో దాగి ఉన్నట్టయితే దాన్ని తగలబెట్టినప్పుడు బయటికి రాకుండా అందులో నికృష్టమైన చావు చావదు. ఆమెను వెతికి రమ్మని అన్ని వైపులకూ అతను మనుషులను పంపాడు. వారిలో కొందరు హంసావళి ఉండే ఫలవృక్ష వనానికి వచ్చి, ఆమే హంసావళి అని తెలుసుకున్నారు. కనకమంజరి చేసిన ద్రోహం బయటపడిందని ఆమె వారిద్వారా తెలుసుకున్నది. ఆమె వారివెంట బయలుదేరి కమలాకరుడి దగ్గిరికి వెళ్ళి అతన్ని తాకగానే అన్నాళ్ళుగా బాధించిన జ్వరం కాస్తాపోయింది.

తరవాత కమలాకరుడు హంసావళిని వైభవంగా పెళ్ళాడి ఆమెతో సహా సుఖంగా రాజ్యమేలాడు.






# మోసగాళ్ళ గురువు

ఒకప్పుడు బాగ్దాదు నగరంలో ధనికుడైన వర్తకుడొకడుండే వాడు. ఆయన ప్రపంచమంతా తిరిగివచ్చాడు గాని కొండలమధ్య ఉండే ఒక నగరానికి ఎన్నడూ వెళ్ళలేదు. ఆ నగరం నుంచి వచ్చిన ఒక బాటసారిని ఆయన కలుసుకోవటం తటస్థించింది.

"ఆ నగరంలో ఏ వస్తువులకు ఎక్కువ గిరాకీ ఉంటుంది?" అని వర్తకుడు బాటసారిని అడిగాడు. చందనపు చెక్కకు మంచి ధర వస్తుందని బాటసారి చెప్పాడు.

సరే, వర్తకుడు తనవద్ద ఉన్న డబ్బుతో దొరికినంత చందనపు చెక్క కొని దాన్ని తీసుకుని కొండలమధ్య ఉండే నగరానికి బయలుదేరాడు. ఆయన నగరాన్ని చేరవస్తుండగా ఒక ముసలిది తన గొర్రెలను తోలుకువస్తూ ఎదురుపడి, ఆయన పరదేశీ వర్తకుడని తెలుసుకుని, "జాగర్త, నాయనా! ఈ నగరంలో వాళ్ళు పచ్చి దొంగలు, పరదేశీలను మహా మోసగిస్తారు!" అని హెచ్చరించి తన దారిన తాను వెళ్ళిపోయింది.

వర్తకుడు నగరద్వారం చేరేసరికి పూర్తిగా చీకటి పడింది. ద్వారం మూసేశారు. తెల్లవార్లూ బయటనే గడిపి, ఆయన మర్నాడు నగరద్వారం దాటాడో లేదో ఒక మనిషి పలకరించి ప్రశ్నలువేశాడు.

"మాది బాగ్దాదు. ఈ నగరంలో చందనపు చెక్కకు మంచి ధర ఉన్నదని విని ఆ సరుకు అమ్మకానికి తెచ్చాను," అని వర్తకుడు చెప్పాడు.

"ఎవరా చెప్పినవాడు. మాకు చందనం కర్ర వంట చెరుకుగా తప్ప పనికిరాదు. వంట చెరుకుకు ఎవరన్నా పెద్ద ధర పెడతారా?" అంటూ కొత్తవాడు తన దారిన తాను వెళ్ళాడు.

ఈ మాటకూడా నిజమో, అబద్ధమో వర్తకుడు తేల్చుకోలేక పోయినాడు. ఆయన

జి. దయానంద్




తన సరుకుతోసహా ఒక వంట పూటి ఇంటికి వెళ్ళి అక్కడ బస తీసుకున్నాడు. తరవాత ఆయన ఆ ఇంటి ఆవరణలోకి రాగా ఒక వింత దృశ్యం కనబడింది. నగర ద్వారం వద్ద తనను పలకరించినవాడూ, మరొకడూ కలిసి ఆరు బయట పొయిపెట్టి మంట చేస్తున్నారు. వారు వంట చెరుకుగా వాడుతున్నవి చందనపు కర్రలే!

ఇది చూడగానే వర్తకుడి గుండె జారిపోయింది. ఆ మనిషి చెప్పినది నిజమే; ఈ నగరంలో చందనాన్ని వంట చెరుకుగా వాడతారు. తన సరుకంతా అమ్మినా కొద్దిపాటి వెండి తప్పరాదు.



వర్తకుడు దగ్గిరికి వచ్చాక ఆ మనుషులు, "మీ సరుకు అమ్ముతారా?" అని అడిగారు.

"దానికి ఏమిస్తారు?" అని వర్తకుడు అడిగాడు.

"అదే బరువుగల సరుకు మీరు ఏది అడిగినా ఇస్తాం," అన్నారు వాళ్లు. అందుకు సమ్మతించి వర్తకుడు తాను తెచ్చిన చందనం కర్రల కట్టలు వారికి ఇచ్చేశాడు.

తరవాత ఆయన నగరం చూడటానికి బయలుదేరాడు. దారిలో ఒక ఒంటికన్నువాడు ఆయనను సమీపించి, చెయ్యి గట్టిగా పట్టుకుని, "ఇదుగో, నా కన్ను పోగొట్టినవాడు!....ఈసారి తప్పించుకు పోలేవులే!" అని కేకలు పెట్టాడు.

నలుగురూ చుట్టూమూగారు. "నువ్వెవరో నేనెరగను. ఈ క్షణందాకా నిన్ను చూడనైనా లేదు. నేనీ ఊరికి రావటం ఇదే మొదటిసారి. నీ కన్ను నేను పోగొట్టానంటావేమిటి?" అని వర్తకుడు అశ్చర్యంగా అడిగాడు, విడపించుకోవటానికి ప్రయత్నిస్తూ.

కాని చుట్టూ మూగినవాళ్ళు ఒంటి కన్నువాడి పక్షమై, వర్తకుడు వాడికి పరిహారం ఇవ్వాలని నిర్ణయించారు. ఆ సంగతి రేపు చూద్దామని చెప్పి వర్తకుడు అప్పటికి తప్పించుకున్నాడు.



అయితే ఈ రద్దీలో వర్తకుడి కాలి చెప్పులలో ఒకటి తెగిపోయింది. ఆయన దాన్ని ఆ సమీపంలోనే ఉన్న చెప్పులు బాగు చేసేవాడి కిచ్చి, బాగు చెయ్యమన్నాడు.

"ఏమిస్తారు?" అన్నాడు చెప్పులు బాగు చేసేవాడు.

"నిన్ను సంతోషపెడితే సరిగద!" అన్నాడు వర్తకుడు. అందుకు చెప్పులు బాగుచేసేవాడు సమ్మతించాడు.

ఒక కాలికి చెప్పు లేకుండా నడవటం కష్టం గనక వర్తకుడు ఆ సమీపంలోనే ఎవరో జూదమాడుతుంటే వినోదం చూస్తూ నిలబడ్డాడు. కొద్దిసేపు గడిచాక, పక్కన నిలబడిన మనిషి వర్తకుణ్ణికూడా పందాలు కాయమన్నాడు. వర్తకుడు జూదం ఆడి కొద్దిసేపట్లోనే అక్కడి జూదరుల కందరికీ బాకీ పడ్డాడు. ఆయనను జూదంలోకి దించిన మనిషి, "సముద్రంలో నీరంతా తాగుతావా? లేక నీకున్నదంతా మాకు ఇచ్చుకుంటావా? ఏదో ఒకటి నిర్ణయించుకో," అన్నాడు.

"రేపటిదాకా గడువిస్తే నిర్ణయించుకుంటాను," అని వారితో చెప్పి వర్తకుడు, తన దుస్థితి తలుచుకుని విచారపడుతూ వీధుల వెంట నడవసాగాడు.




ఆయనకు ఒక చోట ముసలిది మళ్ళీ ఎదురయింది. వర్తకుడి ముఖం చూడగానే ఏదో జరిగిందని ఆమెకు తెలిసిపోయింది. ఆయన ఆమెతో తన అనుభవాలన్నీ పూస గుచ్చినట్టు చెప్పాడు.

అంతా విని ఆమె, "చూశావా, నాయనా? ఈ నగరపు మనుషులు వట్టి పాపిష్టివాళ్ళు. నేను ముందే చెప్పినా నీవు వారి మోసానికి గురి అయావు. ఈ నగరంలో చందనపు కట్టకు పది బంగారుమాడల ధర ఉన్నది. నీ దగ్గిర ఉన్న చందనమంతా అమ్మితే అంతులేని బంగారం రావలిసింది. అయిందేదో అయింది, ఇప్పుడైనా నేను చెప్పినట్టు




చేశావంటే నీకు జరిగిన అన్యాయం కొంత వరకైనా సరికావచ్చు. చీకటి పడే వేళకు నగర ద్వారం వద్దకు వెళ్లావంటే అక్కడ నిర్జన ప్రదేశంలో ఒక గుడ్డి సాధువు కనిపిస్తాడు. నిజానికి వాడు సాధువు కానేకాడు; వాడు ఈ నగరంలో ఉండే మోసగాళ్ల కందరికీ గురువు. చీకటి పడ్డాక మోసగాళ్లు వచ్చి వాడి దగ్గిర సలహాలు పుచ్చుకుని, తాము చేసిన మోసాలన్నీ వాడికి చెప్పి వెళతారు. నువు రహస్యంగా వాళ్ల సంభాషణ ఆలకిస్తే కొంత లాభించవచ్చు," అన్నది.

ఇంకా చీకటి పడకముందే వర్తకుడు నగరద్వారం కేసి వెళ్లాడు. ద్వారం వెలపల ఒక గుడ్డిసాధువు, ముసలిది చెప్పినట్టే, ఒక రాతిని ఆనుకుని సమాధిలో ఉన్నట్టుగా కూచుని ఉన్నాడు.

వర్తకుడు చప్పుడు చెయ్యకుండా వెళ్ళి ఆ రాతి వెనక దాగాడు.

చీకటి పడగానే నగరంలోని మోసగాళ్లు ఒక్కరొక్కరే భక్తుల్లాగా వచ్చి సాధువు ముందు కూచుని తాము చేసిన మోసాలు నివేదించసాగారు. వారిలో వర్తకుణ్ణి మోసగించిన నలుగురూ ఉన్నారు. ఒక్కొక్కరు చేసిన మోసమే విన్నాక సాధువు వారి తెలివితేటలను విమర్శిస్తూ వచ్చాడు. ఆ విమర్శలన్నీ వర్తకుడు వింటున్నాడు.

మోసగాళ్లలో ఒకడు, "స్వామీ, ఇవాళ ఒక పరదేశి వర్తకుడి దగ్గిర అతి చౌకగా చందనం కొన్నాను," అన్నాడు.

"ఏ ధరకు కొన్నావు?" అని సాధువు అడిగాడు.

"చందనం బరువుగలది వర్తకుడు ఏది అడిగినా ఇచ్చే షరతుమీద కొన్నాను," అన్నాడు మోసగాడు.

"వర్తకుడికే లాభం!" అన్నాడు సాధువు.

"అదేమిటి, స్వామీ? ఆ వర్తకుడు చందనం ఎత్తు బంగారం అడిగినా నాకే లాభం గదా!" అన్నాడు మోసగాడు.

"అవును. కాని వాడు ఆ చందనం ఎత్తు ఈగలను ఇవ్వమనీ, అందులో సగం ఆడవీ, సగం మగవీ ఉండాలనీ అంటే నీ గతి ఏమవుతుంది?" అన్నాడు సాధువు. మోస గాడు దిగులుపడి వెళ్ళిపోయాడు.

తరవాత ఒంటి కన్నువాడు ముందుకు వచ్చి, "స్వామీ, ఇవాళ ఒక పరదేశి వర్తకుణ్ణి మోసగించాను. నా కన్ను ఇతనే పోగొట్టా డని ఫిర్యాదు చేశాను. నాకా మనిషి తన కన్నయినా ఇవ్వాలి, లేదా తనకున్నదంతా ఇవ్వాలి," అన్నాడు.

"నీవు మూర్ఖుడివి! ఆ వర్తకుడు నిన్ను సులువుగా టోపీ వేసేస్తాడు. నువు చెప్పేది నిజమని రుజువు చెయ్యటానికి నీ కన్నొకటీ, తన కన్నొకటీ త్రాసులో వేసి తూచి సమంగా ఉంటే నీ మాట నమ్ముతా నంటాడనుకో, నీ గతి ఏమవుతుంది? నీకు రెండో కన్ను కూడా పోయి గుడ్డివాడి వవుతావు. అతని కింకా ఒక కన్ను మిగిలి ఉంటుంది," అన్నాడు సాధువు. ఒంటి కన్నువాడు మండి పడుతూ వెళ్ళిపోయాడు.

తరవాత చెప్పులు కుట్టేవాడు సాధువుతో, "స్వామీ, ఒక పరదేశివాడు ఇవాళ నా చేత చెప్పు బాగు చేయించుకుని నన్ను సంతోష పెడతానన్నాడు. వాడి దగ్గిర ఉన్నదంతా కాజేస్తాను," అన్నాడు.



"నీకు కొంచెంకూడా బుద్ధిలేదు. ఆ వర్తకుడు నీకు రాగి డబ్బుకూడా ఇవ్వడు. వాడు నీతో ఏమంటాడంటే, 'మన సుల్తానుగారి శత్రువులంతా సర్వ నాశనమైపోయారు. ఆయనను ఎదిరించే వాడు ప్రపంచంలో లేడు. ఈ మాట విని నీకు సంతోషమయిందా?' అంటాడు. సంతోషమయిందని చచ్చినట్టు అంటావు; అనకపోతే రాజభటులు నిన్ను చిత్రవధ చేస్తారు!" అన్నాడు సాధువు. చెప్పులు కుట్టే వాడు గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

తరవాత జూదగాడు ముందుకు వచ్చి, "స్వామీ, ఇవాళ ఒక పరదేశిని జూదంలో ఓడించాను. వాడు సముద్రంలో ఉన్న నీరంతా తాగాలనీ, లేకపోతే తన కున్న దంతా నా కిచ్చెయ్యాలనీ షరతు పెట్టాను," అన్నాడు.

"ఆ మనిషి నీకు చిల్లిగవ్వ ఇవ్వడు. సముద్రంలో ఉండే నీరంతా నీ దోసిట్లో పట్టి తెస్తే తాగుతానన్నాడనుకో? నీ గతి ఏమిటి?" అన్నాడు సాధువు.

ఈ సంభాషణలన్నీ వర్తకుడు విని ఉన్నాడు గనక మర్నాడు తనను మోస గించిన నలుగురినీ సులువుగా మోస గించాడు. చందనం ఎత్తు ఈగలను, అందు లోనూ సగం ఆడవీ, సగం మగవీ ఉండే టట్టు, ఇవ్వలేక మొదటి మోసగాడు చందనం కట్టకు పది బంగారు మాడల వంతున డబ్బిచ్చుకున్నాడు. అదే విధంగా మిగిలిన ముగ్గురూ ఆయనకు సమాధానం చెప్పలేక క్షమాపణలు చెప్పకుని తమ దారిన తాము వెళ్ళారు. వర్తకుడు తనకు రావలిసిన డబ్బంతా వసూలు చేసుకుని, నగరమంతా వెతికి ఆ ముసలిదాన్ని పట్టు కుని దానికి కొంత బంగారం బహుమానంగా ఇచ్చి, ఇక జన్మలో ఆ నగరంలో అడుగు పెట్టకూడదనుకుంటూ బాగ్దాదుకు తిరిగి వెళ్ళిపోయాడు.





# కూలి డబ్బులు

ఒక ఊళ్లో భీమన్న అనే కుర్రాడుండేవాడు. వాడికి చిన్నతనంలోనే తల్లీ, తండ్రీ పోవటం చేత వాణ్ణి బామ్మ గారాబంగా పెంచి పెద్ద చేసింది. భీమన్నకు తెలివి తేటలూ, లోక జ్ఞానమూ కొంచెంకూడా లేవు, కాని వాడిది అంతులేని బలం. వాణ్ణి అందరూ గుండు భీమన్న అని పిలిచేవాళ్ళు. వాడికి కొంచెం కూడా చదువు రాలేదు. అటువంటి వాడు గాలికి తిరిగేకన్న ఎక్కడైనా పనికి కుదిరితే కాస్త బాగుపడతాడనే ఉద్దేశంతో బామ్మ వాణ్ణి వెళ్ళి ఎక్కడైనా పని చూసుకో మని చెప్పింది.

పనికోసం వెళ్లినప్పుడు ఎలా మసులు కోవాలో బామ్మ గుండు భీమన్నకు ఈ విధంగా బోధించింది: "మాట్లాడక పని చేసి, పోట్లాడక కూలి పుచ్చుకో. అలా చేసే వాళ్ళనే లోకం మంచి వాళ్లుగా తలుస్తుంది. చేసే పని బాగా చెయ్యి, పుచ్చుకునే డబ్బు చేతినిండా పుచ్చుకో. నే చెప్పిన మాటలు మరిచిపోవు గద!"

బామ్మ చెప్పిన సలహా వాక్యాలు మననం చేసుకుంటూ గుండు భీమన్న పని కోసం ఊరి వెంట బయలుదేరాడు. దారిలో ఒక ఇంటి ముందు వాడికొక పెద్ద మనిషి కన పడ్డాడు. వాడు ఆయనను, "నేను పనికోసం వెతుకుతున్నాను. నాకు మాట్లాడక పనీ, పోట్లాడక కూలీ ఇచ్చేవాళ్ళు కావాలి. ఎవ రన్నా ఉంటే చూపిస్తారా?" అని అడిగాడు.

గుండు భీమన్నకు తెలివితేటలు శూన్య మని తెలిసిపోయింది. ఆయన వాడికి ఒక తొండను చూపించి, "అదుగో, అది నిన్ను మాట్లాడక పనికి రమ్మని పిలుస్తున్నది. అది చెప్పిన పని చేసి పోట్లాడక కూలి డబ్బులు పుచ్చుకో!" అన్నాడు.

గుండు భీమన్న తొండ కేసి చూశాడు. అది మాటాపలుకూ లేకుండా తల పైకీ,

కిందికీ ఆడించటం వాడికి కనిపించింది. అది నిజంగా తనను పిలుస్తున్నదనుకుని వాడు దాన్ని సమీపించాడు. అది భయపడి సమీపంలో ఉండే కలుగులోకి దూరింది.

"ఇది దాని ఇల్లు కాబోలు. అది అయితే లోపలికి సులువుగా వెళ్ళిందిగాని ఈ ఇంటి వాకిలి మరీ చిన్నదిగా ఉందే, నే నెలా పట్టటం?" అనుకున్నాడు గుండు భీమన్న.

వాడు ఆ కలుగు గుర్తు పెట్టుకుని వెళ్లి ఒక గునపం తెచ్చి కలుగును తవ్వి పెద్దది చెయ్యసాగాడు. అలా చీకటి పడేదాకా తవ్వి పెద్ద గొయ్యి చేశాడు. ఆ గోతి అడుగున వాడికొక భాండం దొరికింది. అందులోకి చెయ్యి పెట్టేసరికి బంగారు కాసులు తగిలాయి.

"ఓహో, నేను చెయ్యవలిసిన పని అయిపోయింది కాబోలు, నాకు డబ్బిచ్చేస్తు న్నారు," అనుకున్నాడు వాడు. వాడికి బామ్మ ముందే చెప్పింది. పని బాగా చేసి చేతినిండా డబ్బు తెచ్చుకోమని. అందుకని వాడు పట్టెడు బంగారం కాసులు తీసుకుని మిగిలిన బంగారం అక్కడే వదిలేసి ఇంటికి పోయాడు. వాడు తెచ్చిన బంగారం చూసి బామ్మ నిర్ఘాంతపోయి, "ఇంత బంగారం నీ కెక్కడిదిరా?" అని అడిగింది.

గుండు భీమన్న బామ్మకు జరిగినదంతా చెప్పాడు. అంతా విని ఆవిడ, "ఓరి, వెర్రి కుంకా! ఏదీ ఆ చోటు ఎక్కడో నాకు చూపించు!" అన్నది.

చీకట్లో భీమన్న ఆవిడను తాను తవ్విన చోటికి తీసుకుపోయాడు. ఆవిడ వాడిచేత భాండం పైకి తీయించి, ఇంటికి పట్టించుకు వచ్చి, "ఈ డబ్బు సంగతి ఎక్కడా ఎత్తకు, తెలిసిందా? నీ పెళ్ళికి ఇదంతా ఖర్చు చేద్దాం. అంతదాకా నేను దీన్ని జాగ్రత్తగా దాచి ఉంచుతాను," అన్నది. గుండు భీమన్న తల ఆడించి, సరే నన్నాడు.

[పై మాసం మరొక సంఘటన]





# అనుకోని వివాహం

విసుగు చెందని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అపరాత్రివేళ మరొకరి కోసం నీవీ విధంగా శ్రమపడు తున్నావంటే ఇందుకు తగిన కారణం నీ పూర్వజన్మలో ఏదో ఉండేఉంటుంది. పూర్వజన్మ కారణంగానే కదా సుప్రహరుడనే పల్లెవాడు రాజకుమార్తెను ప్రేమించి, ఆ కారణంగా ప్రాణాలుకూడా వదిలాడు! నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఆ కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

పూర్వం రాజగృహమనే నగరాన్ని మలయసింహుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. ఆ రాజుకు మాయావతి అని అసాధారణ రూపవతి అయిన కుమార్తె ఉండేది.

## బేతాళ కథలు



ఒకనాడు మాయావతి పూలతోటలో విహరిస్తూ ఉండగా సుప్రహరుడనే యువకుడు చూసి మోహించాడు. సుప్రహరుడు కావటానికి అందగాడూ, యువకుడూ— కాని చేపలుపట్టి జీవించే పల్లెవాడు. తాను అతి తక్కువ తరగతికి చెందిన పల్లెవాణ్ణనీ, రాజకుమార్తెపై తనకు పుట్టిన మోహం సఫలం కావటం అసంభవమనీ ఆలోచించకుండా, వాడు మాయవతి కోసం మనోవ్యాధి పడి పోసాగాడు. ఈ మనోవ్యాధితో వాడు చేపలు పట్టటానికి వెళ్లటం మానుకున్నాడు, తిండి తినటంకూడా మానేసి బెంగలో మునిగిపోయాడు.

చూసి చూసి, తల్లి వాణ్ణి ప్రశ్నించి, జరిగిన సంగతి ఉన్నదున్నట్టు తెలుసుకున్నది. అంతా విని ఆమె తన కొడుకుతో, "ఈ భాగ్యానికే విచారం దేనికిరా, నాయనా? లేచి అన్నం తిను. ని కోరిక తీరే ఉపాయం నేను చూస్తాను," అన్నది.

ఈ మాటలకే సుప్రహరుడు దిగులు తీరి, లేచి అన్నం తిన్నాడు.

తరవాత వాడి తల్లి మంచి మంచి చేపలను తీసుకుని రాజుగారి ఇంటికి పోయి, రాజకుమార్తెను చూడ వచ్చానని దాసీల చేత కబురు పంపింది. రాజకుమార్తె ఆమెను లోపలికి రానిచ్చింది. పల్లెవాడి తల్లి మాయావతికి తాను తెచ్చిన చేపలు కానుక పెట్టి వెళ్లిపోయింది.

అదిమొదలు ఆ మనిషి ప్రతిరోజూ రాజకుమార్తెకు మేలురకం చేపలు తెచ్చి కానుక ఇస్తూ వచ్చింది. ఈ విధంగా కొన్ని రోజులు గడిచాక మాయావతి ఆమెతో, "ఏదో కోరిక మనసులో ఉంచుకుని ఓపికగా రోజూ నాకు చేపలు తెచ్చి ఇస్తున్నావు. నీ కోరిక ఏమిటో చెప్పు. కష్టసాధ్యమయినా తీరుస్తాను," అన్నది.

"అభయం ఇస్తే నా కోరిక రహస్యంగా చెబుతాను," అన్నది పల్లెవాడి తల్లి.



మాయావతి అభయమిచ్చి, దగ్గిర ఎవరూ లేకుండా అందరినీ పంపేసినాక ఆమె రాజకుమార్తెతో, "అమ్మా, నా కొడుకు ఒకనాడు నిన్ను పూలతోటలో చూశాట్ట. అదిమొదలు వాడు నీమీది ప్రేమతో పరితపించి పోతున్నాడు. ఒక్కసారి నీవు వాణ్ణి చేత్తో తాకితే తప్ప వాడి ప్రాణాలు నిలిచేటట్టు లేదు," అన్నది.

ఈ మాటలు విని మాయావతి చాలా సిగ్గు పడింది. కాని కోరిక తీరుస్తానని మాట ఇచ్చింది గనక, "సరే, రాత్రివేళ రహస్యంగా నీ కొడుకును నా మందిరానికి తీసుకురా! అతణ్ణి తాకి తాపశాంతి చేస్తాను," అన్నది.

పల్లెవాడి తల్లి పరమానంద భరితురాలై ఇంటికి వెళ్ళి, ఆ రాత్రి తన కొడుకును తనకు చాతనయినంతబాగా అలంకరించి, రహస్యంగా మాయావతి ఇంటికి చేర్చింది. మాయావతి సుప్రహరుణ్ణి ఒక మంచం మీద పడుకోబెట్టి, చల్లని తన చేత్తో వాడి శరీరాన్ని నిమిరింది. ఆ స్పర్శకు వాడు సుఖ సముద్రంలో మునిగిపోయి వెంటనే నిద్ర పోయాడు. వాడు నిద్రపోయాడని తెలియగానే మాయావతి తన పడకగదిలోకి వెళ్ళి నిశ్చింతగా నిద్రపోయింది.

ఆమె తన శరీరం మీదినుంచి చెయ్యి తీయగానే సుప్రహరుడు నిద్రలేచి చుట్టూ చూశాడు. మాయావతి కనిపించలేదు. తాను ప్రేమించిన మనిషి దొరికినట్టే దొరికి అంతలోనే మాయమయేసరికి గుండె పగిలి వాడు ఆ క్షణంలోనే ప్రాణాలు వదిలాడు.

ఈ సంగతి తెలియగానే మాయావతి తన తండ్రికి జరిగినదంతా చెప్పి సుప్రహరుడితోబాటు సహగమనం చేస్తానని చెప్పేసింది. తండ్రి ఎన్నోవిధాల చెప్పిచూశాడు, కాని ఆమె తన ఉద్దేశాన్ని మార్చుకో లేదు.

ఏమి చెయ్యటానికీ పాలుపోక రాజు శుద్ధుడై, ఆచమనం చేసి, తన ఇష్టదైవమైన శంకరుణ్ణి ధ్యానించి, "ఇంత ఘోరపరిస్థితి

ఎలా ఏర్పడింది? ఈ పరిస్థితిలో నేనేం చెయ్యాలి?" అని ఆక్రోశించాడు.

ఆయన ప్రశ్నకు అశరీరవాణి ఇలా సమాధాన మిచ్చింది:

"రాజా, నీ కూతురు క్రిందటి జన్మలో ఈ పల్లెవాడికి భార్య. ఆ జన్మలో ఈ పల్లె వాడు జలధరుడనే బ్రాహ్మడు. అతని తండ్రి చనిపోగానే అతని ఆస్తి అంతా దాయాదులు దోచుకున్నారు. దానితో ఆ జలధరుడికి వైరాగ్యం వచ్చింది. అతను తన భార్యతో సహా గంగా తీరానికి వచ్చి అక్కడ ప్రాయోపవేశం చేసి నిరాహారదీక్ష పట్టాడు. ఆకలితో మలమలలాడే ఆ బ్రాహ్మ డికి గంగాతీరాన చేపలు తింటున్న పల్లె వాళ్ళు కనిపించేసరికి మనసు చలించింది. ఆ దోషంచేత అతను ప్రాణాలుపోయాక పల్లెవాళ్ళ మధ్య తిరిగి జన్మఎత్తాడు. అతని భార్యమాత్రం పవిత్ర హృదయంతో భర్తతో సహగమనం చేసింది. అందుచేత ఆమె ఈ జన్మలో నీ కుమార్తెగా జన్మించింది. ఇప్పుడు కలిగిన విపత్తు తొలగాలంటే నీ కుమార్తె తన ఆయుర్దాయంలో సగం ఆ పల్లెవాడి కిచ్చి అతన్ని పెళ్ళాడటానికి ఒప్పు కున్నట్టయితే వాడు బతుకుతాడు."

తన కుమార్తె చావకుండా ఉంటే అంతే చాలు ననుకుని రాజు మాయావతితో;



"అమ్మా, నీవు సహగమనం చేయవలిసిన పనిలేదు. ఈ పల్లె యువకుణ్ణి పెళ్ళాడి నీ ఆయుర్దాయంలో అతడికి సగం ఇవ్వటానికి సిద్ధపడితే అతను బతుకుతాడు," అని చెప్పాడు. మాయావతి ఆ విధంగానే చేసి సుప్రహరుణ్ణి బతికించుకుని, అతన్ని పెళ్లాడింది. ఆ తరవాత సుప్రహరుడు ఆ దేశానికి రాజై భార్యతో సుఖంగా జీవించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక్క సందేహం. మాయావతి పల్లెయువకుణ్ణి తాకి నిద్రపుచ్చేవరకూ ఆమె తాను ఇచ్చిన మాట నిలబెట్టుకోవటానికే ప్రయత్నించింది. అలాటి మనిషి వాడు పోగానే వాడితో సహగమనం చెయ్యటానికి ఎందుకు ప్రయత్నించింది? వాడిమీది ప్రేమచేతనా? లేక, వాడి చావుకు తానే కారణమనా? లేక, పూర్వజన్మలో వాడి భార్య కావటంచేతనా? దీనికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మాయావతి సుప్రహరుడు జీవించి ఉండగానే అతన్ని తన భర్తగా భావించిందనటానికి సందేహం లేదు. కేవలం పూర్వజన్మ ప్రభావంవల్ల ఆమె వాణ్ణి భర్తగా వరించినట్టయితే వాడు నిద్రపోగానే తన గదికి వెళ్ళిపోయి వాడి చావుకు తాను కారణం కానవసరం లేదు. అచ్చగా అన్నమాట నిలబెట్టుకోవటానికే అయితే ఆమె వాణ్ణి తాకి తాపం తీర్చిన మీదట వాడు ఏమైనా ఆమె పూచీ ఏమీ ఉండదు. వాణ్ణి ప్రాణాలతో ఉండగా ప్రేమించి వాడే తన భర్త అని నిర్ణయించుకున్నది గనకనే ఆమె వాడితో సహగమనం చేయ నిశ్చయించింది. అందుకే వాడికి తన ఆయుర్దాయంలో సగమిచ్చి, వాణ్ణి పెళ్ళాడటానికికూడా ఒప్పుకున్నది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# నెరవేరిన ప్రతిజ్ఞ

కాశ్మీరదేశపు యువరాజు ఒకనాడు తన సిబ్బందితో వేటకు వెళ్లి అరణ్యం నుంచి నగరానికి తిరిగివస్తూండగా ఒకచోట ఒక తెలికలవాళ్ల పిల్ల కనిపించింది. ఆమె నువ్వులు ఎండబోసి వాటికి కాపలా ఉన్నది. యువరాజు పనిపెట్టుకుని ఆమె దగ్గిరిగా వెళ్లి, "నువ్వులలో పుట్టి, నువ్వులలో పెరిగిన నూనెవాడి కూతురా నువ్వుల ఆకు కన్న చిన్న ఆకేది ?" అని అడిగాడు.

ఈ యువరాజు మా కులాన్ని వెక్కిరిస్తాడా అని పౌరుషంవచ్చి ఆ పిల్ల, "పువ్వుల్లో పుట్టి, పువ్వుల్లో పెరిగి భూమిని ఏలే రాజకుమారుడా, పువ్వులన్నిటిలోకి రెండే రెక్కలు గల పువ్వేది ?" అని అడిగింది.

ఆమె తన ప్రశ్నతోనే యువరాజు ప్రశ్నకు సమాధానం చెప్పేసింది. అది చూసి యువరాజు మండిపడి, "నీవు చాలా కుశాగ్రబుద్ధివిగా ఉన్నావు. నిన్ను వదిలిపెట్టరాదు. అందుకని నిన్ను నేనే పెళ్లాడి, యావజ్జీవం చెరలో ఉంచదలిచాను," అన్నాడు.

"యువరాజా, నన్ను నీవు పెళ్లి చేసుకునే పక్షంలో, చెరలో ఉంటూనే నీ కొక కొడుకును కని వాడిచేత నిన్ను కట్టించి కొట్టిస్తాను !" అని ఆ పిల్ల శపథం చేసింది.

యువరాజు అవమానం పొందినవాడై ఇంటికి వెళ్లి ఎవరితోనూ మాట్లాడకుండా, భోజనం చెయ్యకుండా ఒక మూల కూచున్నాడు. రాజుగారు తన కొడుకుతో, "ఎప్పుడో అనగా వేటకు వెళ్లి వచ్చిన వాడివి ఇంకా భోజనంకూడా చెయ్యవేం ?" అని అడిగాడు.

"నా మనసులో ఒక కోరిక ఉంది. దాన్ని తీర్చేటట్లయితే భోజనం చేస్తాను," అన్నాడు యువరాజు. ఆ కోరిక ఏమిటో చెప్పమన్నాడు తండ్రి. తాను వేట నుంచి తిరిగివస్తూ చూసిన తెలికలవాళ్ల పిల్లను

ఎల్. లక్ష్మిపతి



పెళ్లాడాలని ఉన్నదని యువరాజు చెప్పాడు. రాజుగారు కులహీనమైన పెళ్లి చేసుకోవటమా అన్నాడు. ఆ పిల్లను పెళ్లాడనివ్వకపోతే దేశాంతరాలుపట్టి పోతానన్నాడు కొడుకు. ఉన్నది ఒక్కడే కొడుకు కావటంచేత తండ్రి ఈ పెళ్లికి సమ్మతించాడు.

రాజుగారు గుర్రమెక్కి తెలికలవాడి ఇంటికి స్వయంగా వెళ్లి, "నీ కూతుర్ని నా కొడుక్కు చేసుకుంటాను," అని చెప్పటమే గాక ముహూర్తంకూడా ఏర్పాటు చేశాడు. ఆ ముహూర్తానికి పెళ్లికూడా జరిగిపోయింది. ఈలోపల యువరాజు తమ కోటలోనే తన భార్యకోసం ఒక చిన్న భవనం కట్టించి ఆమెను అందులో పెట్టి, ఇంటి వాకిలికి తాళాలు వేయించి, దాన్ని చెరసాలగా తయారుచేయించాడు. ఆమెకు కావలిసిన సంబారాలన్నీ తానే పంపుతూండేవాడు. ఆమెకు పరిచర్యలు చెయ్యటానికి ఒక దాసీది ఉండేది.

యువరాజు భార్య తన తండ్రి సహాయంతో పుట్టింటి లోపలినుంచి తానున్న చెరసాల లోపలికి ఒక సొరంగమార్గం అతి రహస్యంగా ఏర్పాటు చేయించుకుంది. అది మొదలు ఆమె తన దాసితో పిలిచినప్పుడే రమ్మని చెప్పి, తన ఇంటి తలుపులు లోపలి గడియలు వేసుకుని, రోజూ పుట్టింటికి వెళ్లివస్తూ ఉండేది.

ఆమె కోసం ఆమె తండ్రి ఒక మంత్రగాణ్ణీ, ఒక దొమ్మరివాణ్ణీ వెదికితెచ్చి, వారిని తన ఇంట ఉంచి పోషించాడు. యువరాజు భార్య మూడేళ్లు శ్రమపడి వారివద్ద మంత్రవిద్యా, దొమ్మరి విద్యలూ నేర్చుకున్నది.

తరవాత ఆమె దొమ్మరివాడితో, "మీరు కష్టపడి నాకు మీ విద్యలు నేర్పారు. ఇందువల్ల మీకు మంచి లాభం కలగాలంటే మనం రాజుగారి వద్ద మన విద్యలు చూపాలి. వారు మన విద్యలు చూసి మంచి బహుమానా లిస్తారు," అన్నది.

మర్నాడు దొమ్మరివాడు తన పరివారాన్నీ, దొమ్మరివేషంలో యువరాజు భార్యనూ వెంట బెట్టుకుని రాజభవనానికి వెళ్ళాడు. రాజుగారి అనుమతిపై అక్కడ వాళ్ళు ప్రదర్శన ఇచ్చారు. యువరాజు తన స్నేహితులతోకూడా ఈ ప్రదర్శనలు చూస్తున్నాడు. అతని భార్య ముందు పాటలు పాడి, నృత్యాలుచేసి, తరవాత గడ ఎక్కి అతి ప్రమాదకరమైన మొగ్గలు వేయ సాగింది. యువరాజుకు దాన్ని చూసినప్పటి నుంచీ దానిపైన మమకారం కలిగింది. గడమీద మొగ్గలువేస్తూ అది ఎక్కడ పడి పోతుందోనని భయపడి అతను ఆమెను గడమీది నుంచి దిగమని ఆజ్ఞాపించాడు.

తరవాత అతను దొమ్మరివాణ్ణి చాటుగా పిలిచి, "నీ కూతురితో ఒక రాత్రి గడపాలని ఉన్నది. మా ఉద్యానవనానికి తీసుకురా," అన్నాడు. దొమ్మరివాడు సరేనని చెప్పి వెళ్ళి ఆ రాత్రి రాజోద్యానంలో భార్యను భర్త వద్ద చేర్చాడు. యువరాజు భార్య తెల్లవార్లూ తన భర్తతో ఉండి తరవాత తన పుట్టింటికి వెళ్ళి, అక్కడ భోజనం చేసి, చెరసాలకు తిరిగివచ్చింది.

వెళ్ళిపోయేటప్పుడు యువరాజు ఆమెకు బహుమానంగా తన ఉంగరమూ, మరి



కొన్ని ఆభరణాలూ ఇచ్చాడు. యువరాజు భార్య గర్భవతి అయి సకాలంలో ఒక కొడుకును కన్నది. వాడు తాతగారి ఇంటనే పెరుగుతూ, సకల విద్యలూ నేర్చి పెద్దవాడైనాడు. యువరాజు భార్య తాను చేసిన ప్రతిజ్ఞ సగం నెరవేర్చుకున్నది. ఆమె తన భర్తకు ఒక కొడుకును రహస్యంగా కన్నది. ఇక వాడిచేత తండ్రిని కట్టి కొట్టించటమే తరవాయి. అందుచేత ఆమె ఒకనాడు తన కొడుకుతో జరిగినదంతా చెప్పి, తన మిగిలిన ప్రతిజ్ఞ నెరవేర్చమన్నది.

కుర్రవాడు ఇందుకు ఒప్పుకున్నాడు. వాడు వెంటనే బయలుదేరి, అడవిలో

కాపరముండే అవ్వ ఇంటికిపోయి, "అవ్వా, నేను దిక్కులేని వాణ్ణి, నన్ను నువ్వే కాపాడాలి," అన్నాడు.

"నా పశువులను కాస్తూ ఉండు, నాయనా, నీ కింత గంజి కాచిపోస్తూ ఉంటాను," అన్నది అవ్వ.

కుర్రవాడు ఆ ప్రకారమే అవ్వ దగ్గిర ఉంటూ ఒకరాత్రి తన మంత్రశక్తిచేత రాజసౌధం ప్రవేశించి, తన తండ్రి అయిన యువరాజు పడుకునే గది లోపలికి వెళ్లి, యువరాజు మీద మత్తుమందు చల్లి, అతని మంచంకోళ్ళు ఊడదీసి, వాటికి బదులుగా అరటి స్తంభాలుంచి, అతని ఆభరణాలన్నీ తీసుకుని వెళ్లిపోయి, వాటిని ఏటి ఒడ్డున ఇసకలో దాచి, తెల్లవారే లోపల అవ్వ ఇల్లు చేరి పడుకుని నిద్రపోయి, మళ్ళీ తెల్లవారే సరికి ఏమీ ఎరగనట్టు లేచి పశువులను మేప నారంభించాడు.

తెల్లవారగానే యువరాజు గదిలో దొంగ ప్రవేశించినట్టు స్పష్టమయింది. రాజుగారు మంత్రిని పిలిచాడు, మంత్రి తలార్లను పిలిచి, దొంగను పట్టుకోమని ఉత్తరువు చేశాడు. ఆ రాత్రి మంత్రి ఇంట దొంగ పడ్డాడు. మంత్రి భార్య నగలన్నీ పోయాయి.

రాజుగారు తలార్లను మళ్లీ పిలిచి, రెండు రోజులలో దొంగను పట్టుకోకపోతే కఠినంగా



శిక్షిస్తానన్నాడు. తలార్లు దొంగ కోసం వేరు వేరు చోట్ల వెతకసాగారు.

ఆ నగరపు తలారి పెద్దకు ఒక కూతురున్నది. దాని భర్త చాలాకాలం క్రితమే దేశాంతరాలకు వెళ్ళాడు, తిరిగి రాలేదు. తలారి అల్లుడి పేరూ, పుట్టుపూర్వోత్తరాలూ కుర్రవాడు విచారించి తెలుసుకున్నాడు. వాడు తలారికీ, ఆయన భార్యకూ, మిగిలిన వాళ్ళకూ, బట్టలు మొదలైనవి తీసుకొని, వేషం మార్చుకొని తలారి ఉండే ఇంటికి పక్కగా ఉండే ఇంటికిపోయి, "మా మామ గారిల్లు ఎక్కడో చెప్పగలరా?" అని అడిగాడు. వాళ్ళు కొన్ని ప్రశ్నలువేసి, ఆ వచ్చినది తలారి అల్లుడే అనుకుని, ఈ శుభవార్తను తలారికి తెలియజేశారు. తలారీ, తలారి భార్యా చాలా సంతోషించి కుర్రవాణ్ణి తమ ఇంటికి తీసుకుపోయి సకల మర్యాదలూ చేశారు.

ఆ రాత్రి తలారి దొంగను పట్టుకోవటానికి బయలుదేరేటప్పుడు కుర్రవాడు, "మామా, ఎక్కడికి ప్రయాణం?" అని అడిగాడు. దొంగను పట్టబోతున్నానని తలారి చెప్పాడు. తానుకూడా వస్తానని కుర్రాడు తలారి వెంట బయలుదేరాడు.

వారు రాజవీధి వెంట పోతుండగా ఒక చౌకులో బండకొయ్య కనిపించింది.





"మామా, అదేమిటి?" అని కుర్రాడు తలారిని అడిగాడు.

"అది బండకొయ్య. పట్టుకున్న దొంగల కాళ్ళూ, చేతులూ అందులో ఇరికించి మేకు దిగవేస్తే దొంగ తప్పించుకు పోలేడు," అన్నాడు తలారి.

"ఏదీ? నా చేతులూ, కాళ్ళూ అందులో పెట్టి బిగించు, చూద్దాం," అన్నాడు కుర్రాడు.

దేశాంతరాలు తిరిగి ఆ రోజే మళ్ళీ కనిపించిన అల్లుణ్ణి బండకొయ్యలో ఇరికించటం భావ్యంగా ఉండదని తలారి, "నువ్వెందుకు లే. నేనే కాళ్ళూ, చేతులూ దూరుస్తాను. నువు మేకు దిగగొట్టు," అన్నాడు. కుర్రాడు తలారిని ఆ విధంగా బండకొయ్యలో ఇరికించి, మేకు గట్టిగా దిగగొట్టి, "ఇది గట్టిగా ఇరుక్కుపోయింది. ఏం చెయ్యాలి, మామా?" అని అడిగాడు.

"ఇంటికి పోయి, మీ అత్త నడిగి ఉలీ అవీ తీసుకురా," అన్నాడు తలారి.

కుర్రాడు తలారి ఇంటికి వెళ్ళి, "అత్తా, రాజభటులు మామను దొంగ అని పట్టుకుని బండకొయ్యలో పెట్టారు. ఇంటోఉన్న వెండి బంగారాలు కాస్త జాగర్త పెట్టుకోండి," అన్నాడు.

"దాచేటందుకు నాకు మాత్రం చోటెక్కడుంది, నాయనా? కొత్తవాడివి గనక అంతా నీ దగ్గిరే ఉంచు," అంటూ తలారి భార్య ఇంటో ఉన్న డబ్బూ, విలవగల వస్తువులూ కుర్రాడి చేతికిచ్చింది. వాడు వాటిని తీసుకుపోయి ఏటి ఒడ్డున ఇసకలో దాచి, అడవిలో అవ్వ ఇంటికిపోయి పడుకున్నాడు.

తెల్లవారినాక రాజభటులు వచ్చి తలారిని విడిపించి, "ఏం జరిగింది?" అని అడిగారు.

"వాడే దొంగ అయి ఉండాలి. నా అల్లుడని నమ్మాను. చెప్పుకుంటే సిగ్గుచేటు!" అన్నాడు తలారి.

ఈ సంగతి విని రాజు ఆశ్చర్యపడ్డాడు. మంత్రి మటుకు, "మహారాజా, ఇవాళ నేనే స్వయంగా దొంగను పట్టుకుంటాను. ఈ పని తలార్లవల్ల అయేది కాదు," అన్నాడు.

ఆ రాత్రి కుర్రవాడు చాకలివేషం వేసుకుని, చింకిగుడ్డల మూటతో ఏటి ఒడ్డున చాకిరేవు దగ్గిరికి వచ్చి, అక్కడ వాటిని ఉతక నారంభించాడు. మంత్రి రక్షకభటులతో సహా అక్కడికి వచ్చి, "ఎమిరా, ఈవేళప్పుడు చాకిరేవు పెట్టావు?" అని అడిగాడు.

"ఏంచెయ్యను, బాబూ? ఇంకా స్సేపటికి దొంగలు వచ్చి గుడ్డలు తీసుకుపోతారు. వాళ్ల గుడ్డలే ఉతుకుతున్నా," అన్నాడు కుర్రాడు.

"ఒరే, ఆ దొంగలను నాకు పట్టిస్తావా? నూరు వరహాలిస్తాను," అన్నాడు మంత్రి.

"దొంగలను పట్టాలంటే నేను చెప్పినట్టు చెయ్యండి. మీరూ, మీ రక్షకభటులూ ఉంటే దొంగలురారు. మీ పరివారాన్ని పంపెయ్యండి. మీరు ఈ చాకిబానలో దాక్కుని, నేను కేకేసినప్పుడు పైకివచ్చి దొంగలను పట్టుకోండి," అన్నాడు కుర్రాడు.

మంత్రి దొంగలు చిక్కినట్టే సంతోషించి, తనవెంట ఉండే భటులను



దూరంగా పంపేసి, తన ఆభరణాలన్నీ తీసిపెట్టి తాను వెళ్ళి బానలో దూరాడు. వెంటనే కుర్రవాడు ఆ బాన పైన బరువైన రాయి ఒకటి పెట్టి, మంత్రి ఆభరణాలను ఇసకలో పూడ్చి అవ్వ ఇంటికి వెళ్ళిపోయాడు. మంత్రి దూరంగా పంపిన భటులు తెల్లవారేదాకా చూసి చాకిరేవుకు వెళ్ళేసరికి బానలో నుంచి మంత్రి పెట్టే కేకలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి. వారు అయునను ఆ బానలో నుంచి పైకి తీశారు. మంత్రి వాళ్ళతో, "ఒరే, ఈ సంగతి ఎవరికీ చెప్పకండి! నా పరువు పోతుంది," అని చెప్పుకున్నాడు.

మర్నాడు యువరాజే స్వయంగా దొంగను పట్టటానికి బయులుదేరుతున్నాడని కుర్రవాడికి తెలిసింది. "ఇవాళ మా అమ్మ ప్రతిజ్ఞ నెరవేరుస్తాను," అనుకుని, వాడు ఆ రాత్రి ఒక కోమటివేషం వేసుకొని, ఏటి సమీపాన, నగరం వెలపలగా ఒక చిన్న పాకావేసి, అందులో పెట్టవలిసిన సరుకు లన్నీ సంపాదించి చిన్న దుకాణం ఏర్పాటు చేశాడు. కొన్ని కట్టుతాళ్ళూ, ఒక గోతమూ కూడా వాడు సిద్ధంచేశాడు. తరవాత ఒక గుడ్డిదీపం వెలిగించి ఆ దుకాణంలో కూచున్నాడు. యువరాజు సైనికులతో నగరమంతా గస్తీ తిరిగి ఒక రాత్రివేళ అక్కడికి వచ్చాడు. అతణ్ణి చూడగానే, కోమటివేషంలో ఉన్న కుర్రవాడు భయ భక్తులు అభినయిస్తూ, ఎదురువెళ్ళి దణ్ణాలు పెట్టి నిలబడ్డాడు.

"కోమటీ, ఈ అర్ధరాత్రివేళ ఎవరికోసం ఈ అంగడి తెరిచి ఉంచావు?" అని యువ రాజు కుర్రవాణ్ణి అడిగాడు.

"మహారాజా, దొంగలు తమ పని పూర్తి చేసుకుని ఇటుగానే వస్తారు. వాళ్ల కోసం కాచుకుని ఉన్నాను," అన్నాడు కుర్రవాడు.

యువరాజు ఈ మాటలు విని సంతోషించి, "కోమటీ, ఆ దొంగలను నాకు పట్టిస్తావా?" అని అడిగాడు.



"మీరు దొంగలను పట్టుకోవాలంటే నేను చెప్పిన యుక్తి చెయ్యాలి. మీ సైనికుల నందరినీ నగరద్వారం దగ్గిర దాగి ఉండమనండి. మీరు ఒక మూటలో దాగి ఉండండి. దొంగలు రాగానే, ఇదుగో మీ సరుకు, అని వారికి మూట ఇస్తాను. అప్పుడు వారు మూట విప్పుతారు. మీరు పైకివచ్చి కేకవేస్తే, మీ సైనికులు వచ్చి దొంగలందరినీ పట్టుకోవచ్చు," అన్నాడు కుర్రాడు.

నిజమే ననుకుని యువరాజు తన సైనికులందరినీ దూరంగా పంపేశాడు. తన కత్తీ, దుస్తులూ, తలపాగా, అన్నీ తీసి కోమటికిచ్చి, తాను గోనెసంచీలో దూరాడు. కుర్రవాడు సంచీ మూతిని తాళ్లతో గట్టిగా బిగించాడు. తరవాత వాడు తన వేషం విప్పేసి, యువరాజు దుస్తులన్నీ వేసుకుని, సైనికులకు సంజ్ఞచేశాడు.

సైనికులువచ్చి కుర్రవాణ్ణి చూసి యువరాజే అనుకున్నారు.

కుర్రవాడు వాళ్లతో, "ఎంత జిత్తులమారి అయితేనేం, దొంగల నాయకుడు దొరికి పోయాడు. వాణ్ణి ఈ మూటలో కట్టేశాను. ఈ మూట తీసుకుని రాజభవనానికి పోదాం పదండి!" అన్నాడు.

సైనికులా మూటను కసికొద్దీ తన్ని దానితో రాజభవనానికి బయలుదేరాడు. మూటలో



ఉండి యువరాజు పెట్టిన కేకలు ఎవరూ వినిపించుకోలేదు.

తన కొడుకు దొంగను పట్టి తెస్తున్నాడని తెలియగానే రాజు చాలా సంతోషించాడు. కాని తీరా కుర్రవాడు సంచీతోసహా వచ్చే టప్పటికి రాజుగారు, "దొంగ ఎక్కడ? నా కొడు కెక్కడ?" అని అడిగాడు.

"మహారాజా, దొంగను నేనే. యువరాజు గారు ఈ మూటలో ఉన్నారు. జరిగినది ఆయన నన్ను పట్టుకోవటం కాదు—నేనే ఆయనను పట్టుకున్నాను," అన్నాడు కుర్ర వాడు. మూట విప్పేసరికి యువరాజు పైకి వచ్చాడు. ఆ యువరాజు దుస్తులు ధరిం చిన కుర్రవాణ్ణి చూసేసరికి రాజుగారికి మండిపోయింది. ఆయన తన భటులతో, "ఈ ద్రోహిని తీసుకుపోయి చిత్రవధ చెయ్యండి," అన్నాడు.

"మహారాజా, తొందర పడకండి. శిక్షించేముందు విచారణ జరపటం న్యాయం. నేను పరాయివాణ్ణి కాను, మీ మనవణ్ణే. మీ కొడుకును పెళ్లాడి చెరలో ఉన్న తెలికల మనిషి మా అమ్మ. ఆవిడ ప్రతిజ్ఞ నెర వేర్చటానికే నా తండ్రిని నేను ఇలా కట్టి తేవలసి వచ్చింది. మా అమ్మనూ, ఆమె తల్లిదండ్రులనూ పిలిపించండి. నిజం మీకే తెలుస్తుంది!" అన్నాడు కుర్రవాడు.

ఆ ప్రకారమే యువరాజు భార్యనూ, ఆమె తల్లిదండ్రులనూ తెచ్చారు. జరిగిన దంతా బయటపడింది. దొమ్మరిపిల్లకు యువరాజిచ్చిన ముద్రికా, ఆభరణాలూ, ఆమె ఉండిన ఇంటికీ, ఆమె పుట్టింటికీ మధ్యగల సొరంగమార్గమూ చూశాక నిజం రుజువైపోయింది.

రాజుగారు తన మనవడి తెలివితేట లకూ, తన కోడలి పట్టుదలకూ సంతో షించాడు. యువరాజు ఓటమి ఒప్పుకుని, తన భార్యతోనూ, కొడుకుతోనూ సుఖంగా జీవించాడు.






విశ్వామిత్రుడూ, ఆయన వెనకగా రామలక్ష్మణులూ ఒక కోసు దూరం నడిచి వెళ్ళి సరయూ నది దక్షిణపుగట్టు చేరుకున్నారు.

"నాయనా, రామా! నీవు వెంటనే ఆచమనం చేసి రా. నీకు బల, అతిబల అనే రెండు విద్యలిస్తాను. మంత్రాలతో కూడి ఉన్న ఈ విద్యలు నీకు అలసటా, జబ్బూ, రాకుండా చేస్తాయి. నీ రూపం చెక్కు చెదరకుండా ఉంచుతాయి. నిన్ను ఆపదల నుంచి కాపాడతాయి. ఆ మంత్రాలు జపిస్తూ ఉన్నంత కాలమూ నిన్ను మించిన అందగాడూ, తెలివిగలవాడూ, నేర్పరీ, వాదనలో నిన్ను మించగలవాడూ ఉండరు. ఆకలిదప్పు లుండవు. గొప్ప కీర్తి కలుగుతుంది," అన్నాడు విశ్వామిత్రుడు.

రాముడు సంతోషంతో ఆచమనం చేసి పరిశుద్ధుడై విశ్వామిత్రుడి నుంచి బలాతిబలలను గ్రహించాడు. ఆ రాత్రికి వారు సరయూ తీరాన విశ్రాంతి తీసుకున్నారు.

తెల్లవారుతూనే విశ్వామిత్రుడు వారిని నిద్రలేపి, సరయూ నదిలో స్నానాలు చేయించాడు. వారు తమ అనుష్ఠానాలు పూర్తి చేసుకుని విశ్వామిత్రుడి వెంట మళ్ళీ బయలుదేరి, సరయూనది గంగలో కలిసే చోటికి వచ్చారు.

అక్కడ ఒక ఆశ్రమం ఉన్నది. అక్కడ ఒకప్పుడు శివుడు తపస్సు చేసుకుంటూ ఉంటే మన్మథుడు ఆయన తపస్సు చెడగొట్టటానికి వచ్చి, శివుడు తన మూడో కన్ను తెరిచేసరికి భస్మమైపోయాడు. అదిమొదలు



ఆ ఆశ్రమంలో శివుడి శిష్యులైన మునులుంటున్నారు. మన్మధుడు తన అంగాన్ని—అంటే శరీరాన్ని—అక్కడ పోగొట్టుకున్నాడు గనక, ఆ ప్రాంతానికి అంగదేశమనే పేరు వచ్చింది.

రామలక్ష్మణులు ఈ విషయాలన్నీ విశ్వామిత్రుడి ద్వారా తెలుసుకుని, ఆ రాత్రి ఆ ఆశ్రమంలో గడిపి, మర్నాడు ఒక పడవలో గంగను దాటారు. ఆ తరవాత వారు కాలినడకను ఒక భయంకరమైన అరణ్యం ప్రవేశించారు. ఎక్కడా జన సంచారం లేదు. విడవకుండా కీచురాళ్ళ అరుపులూ, సింహగర్జనలూ, పులుల



కాండ్రింపులూ, అడవిపందుల గురగురలూ, ఏనుగుల ఘీంకారాలూ వినవస్తున్నాయి. చంద్ర, మద్ది, మారేడు, తుమ్మ, రేగు మొదలైన చెట్లు దట్టంగా పెరిగి మనుషులు చొర రాకుండా ఉన్నది ఆ అరణ్యం.

రాముడా అరణ్యాన్ని చూసి ఆశ్చర్య పడి విశ్వామిత్రుణ్ణి, "మహామునీ, ఈ అరణ్యం పేరేమిటి?" అని అడిగాడు. విశ్వామిత్రుడు ఆ అరణ్యం కథ అంతా రామలక్ష్మణులకు వివరంగా చెప్పాడు.

ఆ ప్రాంతంలో ఒకప్పుడు మలదమూ, కరూశమూ అని రెండు గొప్ప దేశాలుండేవి. ఈ ప్రాంతాలలో తాటక అనే యక్షిణీ, దాని కొడుకు మారీచుడనేవాడూ చేరి రెండు దేశాలనూ నాశనం చేస్తున్నారు. వారికి జయపడి మనుషులెవరూ అటుకేసి రావటం లేదు. తాటక సామాన్యురాలు కాదు, వెయ్యి ఏనుగుల బలం కలది. అందుచేత అది సుభిక్షంగా ఉన్న రెండు దేశాలనూ మహారణ్యంగా మార్చ గలిగింది.

ఈ మాట విని రాముడు, "స్వామీ, యక్షులు అల్ప శక్తిగలవారంటారు గదా, ఈ తాటక అనే యక్షిణికి వెయ్యి ఏనుగుల బలం ఎలా వచ్చింది?" అని విశ్వామిత్రుణ్ణి అడిగాడు.





"నాయనా, తాటక వృత్తాంతంకూడా చెబుతాను, విను. సుకేతుడనే గొప్ప యక్షుడుండేవాడు. ఆయన బిడ్డలను కోరి గొప్ప తపస్సు చేశాడు. బ్రహ్మ ఆయన తపస్సుకు సంతోషించి, ఆయనకు కొడుకును ఇవ్వక, వెయ్యి ఏనుగుల బలంగల కూతురు కలిగే లాగుమటుకు వరమిచ్చాడు. బ్రహ్మ వర ప్రభావంచేత సుకేతుడికి తాటకపుట్టి పెరగ సాగింది. ఆమె యుక్తవయస్సు వచ్చి మంచి అందగత్తెగా తయారయింది. అప్పుడు సుకేతుడు ఆమెను సుందుడనే యక్షకుమారుడి కిచ్చి పెళ్ళి చేశాడు. వారిద్దరికీ మారీచుడనే కొడుకు కలిగాడు. వాడు పరాక్రమంలో ఇంద్రుణ్ణి పోలినవాడు, చాలా గర్వంగలవాడు. ఇలా ఉండగా ఒక సంగతి జరిగింది. ఈ ప్రాంతాలనే తపస్సు చేసుకుంటున్న అగస్త్యుడు తాటక భర్త అయిన సుందుణ్ణి చంపాడు. అందుకని తాటకా, మారీచుడూ అగస్త్యుడిపై ఆగ్రహించి, గట్టిగా అరుస్తూ ఆయనను తినేసేటట్టుగా మీదికి వచ్చారు. అప్పుడగస్త్యుడు వారిద్దరినీ రాక్షసులు కమ్మని శపించాడు. మారీచుడు రాక్షసుడైపోయాడు. తాటక తన అందమంతా కోల్పోయి భయంకరాకారం ధరించి, నరభక్షిణిగా మారి పోయింది. తాటక అగస్త్యుణ్ణి ఏమీ చెయ్యలేక ఆయన సంచరించిన ఈ పుణ్యభూమిని పాడుపెట్టేస్తూ భీభత్సం కలిగిస్తున్నది. అందుచేత, ఓ రామా, నీవా తాటకను వధించు. ఆడదని సంకోచించకు. ఈమె చేస్తున్న దుర్మార్గానికి అంతులేదు. ఈమెను చంపినందువల్ల నీకు కొంచెమైనా పాపం రాదు," అని విశ్వామిత్రుడు చెప్పాడు. రాముడు చేతులు జోడించి, "మహాముని, మా తండ్రి మీరు చెప్పినదెల్లా చెయ్యమని ఆజ్ఞాపించి మీ వెంట పంపారు. అందుచేత మీ ఆజ్ఞ చొప్పున అలాగే తాటకను చంపుతాను," అన్నాడు.

అ తరవాత రాముడు బాణంచేత పట్టి దాని తాడును బలంగాలాగి ఖంగు ఖంగు మని మోగించాడు.

ఈ చప్పుడు వినపడే సరికి తాటాకా వనంలో ఉండేవారంతా ఉలిక్కిపడ్డారు. తాటక మండిపడి ఆ ధ్వని వినిపించిన వేపు అతి వేగంగా పరిగెత్తుకుంటూ వచ్చింది. అలా తమకేసి వచ్చే తాటకను చూసి రాముడు లక్ష్మణుడితో, "చూశావా, లక్ష్మణా, ఈమె ఎంత వికారాకారం కలిగి, ధైర్యవంతులకుకూడా భీతి కలిగించేదిగా ఉన్నదో! ఈ ఆడదాన్ని చంపటానికి నాకు చేతులు రావటంలేదు. దగ్గిరికి రానీ, ముక్కూ, చెవులూ కోసి, పొగరు అణచి పంపేద్దాం!" అన్నాడు.

తాటక ఈ మాటలు విని మరింత ఉగ్రురాలై చేతులు పైకెత్తి రాముడి మీదికే వచ్చి, దుమ్ము చిమ్ముతూ రామలక్ష్మణులను కప్పేసి, వారిపై రాళ్ళవాన కురిపించ సాగింది. రాముడు దాని చేతులు రెండూ తన బాణాలతో తెగగొట్టాడు. లక్ష్మణుడు అతి కోపంతో దాని ముక్కూ, చెవులూ కోసేశాడు. కాని మాయావి అయిన తాటక వాళ్ళపై మళ్లీ రాళ్లవాన కురిపించసాగింది.

అప్పుడు విశ్వామిత్రుడు, "రామా, ఈ పాపాత్మురాలిని దయతలుస్తా వేమిటి?



ఇది ప్రాణాలతో ఉంటే ఇంకా ఎన్ని మాయ లైనా చెయ్యగలదు. సంధ్యాకాలం లోపల దీన్ని చంపెయ్యి. ఉదయవేళా, సాయం సమయానా రాక్షసులకు బలం హెచ్చు. ఆ సమయంలో వారిని జయించటం కష్టం," అని హెచ్చరించాడు.

ఈమాట విని రాముడు తాటక రొమ్ము లోకి ఒక్క బాణం బలంగా కొట్టాడు. ఆ దెబ్బతో అది నేలమీద పడి, గిలగిలా తన్నుకుని ప్రాణాలు వదిలింది.

విశ్వామిత్రుడు పరమానందభరితుడై రాముణ్ణి దగ్గిరికి తీసుకుని, తల వాసన చూసి, "నాయనా, ఈ దుష్టురాలిని చంపి చాలా మేలు చేశావు. ఈ రాత్రికి మనం ఇక్కడనే ఉండి, తెల్లవారి మన ఆశ్రమానికి పోదాం," అన్నాడు.

మర్నాడు వేకువజామునే ఆయన రాముణ్ణి లేపి, తాను శుచి అయి, తూర్పు ముఖంగా కూచుని రాముడికి అనేక అస్త్రాల తాలూకు మంత్రాలు ఉపదేశించి, జపం చేశాడు. అంతలోనే ఆ అస్త్రాలన్నీ రాముడి ఎదట రూపంతో నిలబడి, చేతులు జోడించి, "మేము నీ భృత్యులం. ఏ పని చెబితే అది చేస్తాం," అన్నాయి. రాముడు ఆ అస్త్రాలను చేతితో తాకి, "ఇప్పటికి మీరంతా నా మనసులో చేరి ఉండండి," అని చెప్పాడు.





తరవాత రాముడు విశ్వామిత్రుడి నుంచి అస్త్రాలను ఉపసంహరించే మంత్రాలు కూడా అడిగి తెలుసుకున్నాడు. తరవాత వారు ముగ్గురూ ప్రయాణం సాగించారు.

వారు కొంతదూరం పోయేసరికి ఒక కొండ పక్కగా ఒక అందమైన వనం కనిపించింది. రాముడది చూసి, "స్వామీ, ఈ వనం చూస్తే నా కెంతో ఆనందంగా ఉన్నది. ఇది ఒక ఆశ్రమమనికూడా తోస్తున్నది, దీని కథ ఏమిటి?" అని అడిగాడు. విశ్వామిత్రుడు ఈ విధంగా చెప్పాడు:

"నాయనా, పూర్వం విరోచనుడి కొడుకైన బలి మహా బలపరాక్రమశాలి అయి,



మూడు లోకాలనూ జయించి స్వర్గలోకం ఆక్రమించే సరికి, మహావిష్ణువు కశ్యపుడికి వామనుడుగా పుట్టి, బలి చేసే మహా యాగానికి వెళ్ళి బలిని మూడడుగుల భూమి యాచించాడు. బలి ఇచ్చాడు. వామనుడు మూడడుగులలా కొలిచి మూడు లోకాలూ పుచ్చుకుని బలిని అధోలోకానికి పంపేశాడు. ఆ వామనుడూ, ఆయన తండ్రి కశ్యపుడూ కూడా ఈ ఆశ్రమంలోనే దీర్ఘ తపస్సు చేశారు. అందుచేత నేనుకూడా ఇక్కడే ఆశ్రమం ఏర్పాటు చేసుకున్నాను. రాక్షసులు మాటి మాటికీ వచ్చి నన్ను చాలా క్షోభ పెడుతున్నారు. వారందరినీ నీవు చంపాలి."

విశ్వామిత్రుడుంటున్న ఆశ్రమం పేరు సిద్ధాశ్రమం. విశ్వామిత్రుడు రామలక్ష్మణులతోసహా ఆశ్రమం ప్రవేశించగానే అక్కడ ఉండే మునులందరూ సంతోషంతో పరిగెత్తుకుంటూ వచ్చి విశ్వామిత్రుణ్ణి పూజించి, రామలక్ష్మణులకు అతిథి సత్కారాలు చేశారు. రామలక్ష్మణులు కొంచెంసేపు విశ్రమించి ప్రయాణపు బడలిక తీర్చుకుని, విశ్వామిత్రుడి వద్దకు వచ్చి నమస్కారం చేసి, "మహామునీ, ఇక మీరు యాగం సాగించే ప్రయత్నాలు చేయవచ్చు. మీ యాగాన్ని మేము రక్షిస్తాము," అని చెప్పారు.



ఆ రాత్రి గడిచింది. రామలక్ష్మణులు లేచి, సంధ్యానుష్ఠానాలన్నీ ముగించి విశ్వామిత్రుడి వద్దకు వచ్చేసరికి ఆయన అప్పటికే హోమం ముందు కూచుని ఉన్నాడు. వారు విశ్వామిత్రుడికి నమస్కరించి, "మహాత్మా, రాక్షసులు ఎప్పుడు వస్తారు? వాళ్ల కోసం మేము ఏ సమయాలలో కాచుకుని ఉండాలి?" అని అడిగారు.

విశ్వామిత్రుడు జవాబు చెప్పలేదు, కాని యజ్ఞవేదిక చుట్టూ చేరిన మునులు రామలక్ష్మణులతో, "నాయనలారా, 'విశ్వామిత్రుడు యాగదీక్షలో ఉండటంచేత మౌనంగా ఉండాలి. ఇవాళనుంచి ఆరు రోజులదాకా మీరు మమ్మల్ని కాపాడాలి," అని చెప్పారు.

రామలక్ష్మణులు పెద్ద పెద్ద బాణాలు ధరించి, రాత్రివేళ నిద్రకూడా మాని అయిదు పగళ్ళూ, అయిదు రాత్రులూ ఆశ్రమాన్ని కాపాడారు. ఆరో రోజు వచ్చింది.

యజ్ఞశాలలో అగ్ని దేదీప్యమానంగా వెలుగుతున్నది. విధియుక్తంగా, మంత్రోక్తంగా యాగం నడుస్తున్నది. ఆ సమయంలో ఆకాశం నుంచి పెడబొబ్బలు వినిపించాయి. సుబాహు మారీచులూ, వారి బలగానికి చెందిన రాక్షసులూ కారుమేఘాలలాగా ఆకాశం ఆవరించి యజ్ఞవేదికపై రక్త వర్షం కురిపించసాగారు.

రాముడు రాక్షసుల ఆర్భాటాలు విని, తలఎత్తి ఆకాశంలోని రాక్షసమూకను చూశాడు. అతను మానవాస్త్రం ఎక్కుపెట్టి మారీచుణ్ణి కొట్టాడు. ఆ దెబ్బకు వాడు వెళ్ళి సముద్రంలో పడ్డాడు. తరవాత రాముడు ఆగ్నేయాస్త్రంతో సుబాహుణ్ణీ, వాయవ్యాస్త్రంతో మిగిలిన రాక్షసులనూ చంపేశాడు. విశ్వామిత్రుడి యాగం పూర్తి అయింది. ఆయన రాముడితో, "నాయనా, నాకు చాలా గొప్ప ఉపకారం చేశావు," అంటూ అతన్ని ప్రశంసించాడు.



# మండూ శిథిలాలు

ఇండోరుకు 62 మైళ్లదూరాన ఒక ఎత్తయిన పీఠభూమి పైన నిర్మించిన పురాతన దుర్గం మండూ. 11-వ శతాబ్దంలో మాల్వాదేశాన్ని పార మారు వంశపు రాజులు స్వతంత్రులుగా ఏల సాగినప్పు డీ దుర్గం ఉన్నతికి వచ్చింది. 1304-1401 మధ్య మాల్వా ముస్లిమ్ సామ్రాజ్యంలో చేరిపోయింది.

అటు తరవాత 125 ఏళ్లపాటు ఘోరీలూ, ఖిల్జీలూ మాల్వాను స్వతంత్రంగా ఏలి, మండూను తమ రాజధాని చేసుకున్నారు.

మండూ అంటే "ఆనందనగరం" అని అర్థం వర్షాకాలంలో ఇక్కడ ఉన్నంత సుఖమూ సౌందర్యమూ మరెక్కడా ఉండబోవని మొగలాయి చక్రవర్తి జహంగీరు తన అనుభవాలలో తెలిపాడు. పైన చెప్పిన 125 ఏళ్ళ కాలంలో ఇది నిజంగా "ఆనందనగరం" గానే తయారయింది.

ఇక్కడ ఒక ఏడంతస్తుల విజయస్తూపమూ, చలవరాతితో కట్టిన అష్రఫీ మహల్, జామీ మసీదూ, హొషంగ్ షా సమాధీ, నిరుపమానమైన జహాజ్ మహల్, హిందోలా మహల్ ఉన్నాయి. సమీపంలో కొండపై రూపమతి మండపం ఉన్నది.

ఈ రూపమతి అనే ఆమె ఒక గాయకి. మండూను స్వతంత్రంగా పాలించిన ఆఖరు రాజు బాజ్ బహదూర్‌కు ఈమెపై గల ప్రేమను ఇప్పటికీ పాటలుగా పాడతారు 1561లో మండూను అక్బరు జయించి బాజ్ బహదూర్ ఓడిపోయి నప్పుడు రూపమతి అవమానం సహించలేక ఆత్మహత్య చేసుకున్నదట.






1. వి. శ్రీనివాసం, మండపేట

మేము ప్రశ్నలతోబాటు మా అభిప్రాయాలుగూడా పంపవచ్చునా?

"పాఠకుల లేఖలు" అన్న శీర్షిక మీ అభిప్రాయాలు ప్రకటించటానికే.

2. తాడూరి దుర్గాప్రసాద్, తాడేపల్లిగూడెం

అన్నయ్యా, అట్టల వెనకాల ఫొటోలు వ్యాఖ్యలతో ప్రచురించేవారు. అవు చేసినందు వల్ల "చందమామ"కు కాంతి సన్నగిల్లిందంటాను.

అట్టలు ఆఫ్‌సెట్ మీద ముద్రించటం ఆరంభించినాక ఫొటోలను వెయ్యటం అసౌకర్యంగా పరిణమించింది. అయితే చాలామంది పాఠకులు కావాలని కోరుతున్నం దున పెద్ద ఫొటోలను ఈ సంచిక నుంచి లోపలి పేజీలలో వేస్తున్నాము.

3. ములకల మేనకాదేవి, ఏలూరు

"చందమామ"లోకి మేము పంపించే కథలు పేజీ చివరన ఎక్కువ తక్కువ లేకుండా ఏవిధంగా సరిపోవుచున్నవి, అన్నయ్యా?

"చందమామ"లో పడే కథలకు దర్జీపని చాలా ఉంటుంది, చెల్లెమ్మా!

4. కొడమంచిలి సుందరరామం, కాకినాడ

"చందమామ"లో సాంఘిక రచనలు తీసుకోక పోవుటకు కారణము?

అవి లేకపోవటమే "చందమామ" ప్రత్యేకత. సాంఘిక రచనలు అన్ని పత్రికల లోనూ ఉంటూనే ఉన్నాయిగద.

5. వెన్నూరి కమలాకర్, పెద్దపల్లి

"చందమామ"లో ప్రచురించిన సీరియల్ కథలన్నియు పుస్తకరూపంగా వెలువడినవా?

అన్నీ పుస్తకాలుగా రాలేదు. "తండ్రి కొడుకులు", "విచిత్ర కవలలు," "ఐదు ప్రశ్నలు" మాత్రమే పుస్తకాలుగా వెలువడ్డాయి.

6. ఏ. ఎస్. పోశెట్టి, నిజామాబాద్

"చందమామ"లో ఒక నవలను ప్రచురించి నా కోరిక నెరవేరుస్తారా?

"తోకచుక్క" మొదలుకొని "జ్వాలాద్వీపం" దాకా "చందమామ"లో వచ్చినవన్నీ నవలలుకావా?

7. ఎ. వి. వి. బి. హరగోపాల్, కణితి

అన్నయ్యా, "చందమామ" ఇంటికి రావడము తడవు, నేను, మా అక్క పోట్లాడుకుంటాము. న్యాయంగా ముందు చిన్నవాళ్ళు చదవాలా, పెద్దవాళ్లు చదవాలా, మీరే చెప్పండి.

మీ అక్క పోట్లాటలో నెగ్గుతున్నట్టు కనిపిస్తుంది. ఎందుకంటే, పోట్లాటలో గెలవగల వాళ్ళు న్యాయం ఆశ్రయించరు. న్యాయం కావలిసినవాళ్ళు పోట్లాడరు. అవునా?

8. ఎం. కరుణ, కె. ఎ. పూర్ణ, చెన్నాడచెరువు

చందమామా! మా వదిన మా ఇంటిలో కాలిడినప్పటినుండి కిటికీలోనూ నువ్వే, డ్రాయరుపైనా నువ్వే, ఆఖరుకు పడకమంచము తలదిండుపైనా నువ్వే సంచరిస్తున్నావు. నీకెవరిచ్చారీ హక్కు? చెప్పు.

మీ వదినె పుట్టింటి నుంచి ఈ హక్కు తెచ్చుకున్నట్టుంది. అడిగేదేదో ఆమెనే అడగండి.

9. ఎస్. వి. హనుమంతరావు, తెనాలి

ఫొటోల వ్యాఖ్యలపోటీలో ఒకసారి బహుమతి పొందినవారికి, కొన్ని నెలల వరకూ, వ్యాఖ్య శ్రేష్ఠంగా ఉన్నా, బహుమతి యివ్వగూడదని నిర్ణయం ఏదైనా ఉన్నదా?

అటువంటిదేమీ లేదు. ఒకే వ్యక్తి ఏడాదికి పన్నెండు నెలలూ బహుమతి సంపాదించినా మాకేమీ నష్టం లేదు. వ్యాఖ్య అత్యుత్తమంగా ఉండటమే ప్రధానం. వ్యాఖ్యలు పరిశీలించటానికే ఎంతోకాలం పడుతుంది. వాటిని పంపేవారి పేర్లూ విలాసాలూ చూడటానికి వ్యవధి ఎక్కడ?

10. ఎమ్. వి. ఆర్. నమ్మాళ్వార్లు, గంపలగూడెం

ఓ చందమామా! మా రచన త్రిప్పి పంపలేదు–సరి–వేసుకోలేదు. ఏం చేశావు?

తిరుగు టపాకు స్టాంపులు జతచేసి పంపని రచనలు మా వద్ద చాలా ఉన్నాయి వాటిలో మీ రచనకూడా చేరివుండవచ్చు.

Photo by V. Thithu



బహుమతి
పొందిన వ్యాఖ్య

విశేషంగా ప్రేమిస్తే...

పంపినవారు:
పి. రామచంద్ర, వేములవాడ.

Photo by P. Krishna Kumar



బహుమతి
పొందిన వ్యాఖ్య

వీపుపై నెక్కుతారు!

పంపినవారు:
పి. రామచంద్ర, వేములవాడ.

# అట్టచివరి బొమ్మ

దుశ్శాసనుణ్ణి చంపి అతడి రక్తం తాగిన భీముణ్ణిచూసి అందరికీ మతులుపోయాయి.

భీముడు భయంకరమైన ఆ అవతారంతో కృష్ణార్జునులను సమీపించి, "దుశ్శాసనుడిపై చేసిన ప్రతిజ్ఞ తీర్చుకున్నాను. దుర్యోధనుడిపై ప్రతిజ్ఞకూడా తీర్చుకుంటాను," అన్నాడు.

ఈ లోపుగా యుధామన్యుడనేవాడు కర్ణుడి తమ్ముడైన చిత్రసేనుణ్ణి చంపాడు. కర్ణుడి కొడుకు వృషసేనుడు అత్యంత శౌర్య పరాక్రమాలతో పోరాడుతూ నకులుణ్ణి విరథుణ్ణి చేసేశాడు. అర్జునుడు వరసగా బాణాలతో వృషసేనుడి విల్లూ, చేతులూ, తలా నరికేశాడు.

కర్ణుడు పొంగివచ్చే దుఃఖంతో తన కొడుకు రథాన్ని సమీపించి, వాడి శవాన్ని చూసుకుని, అర్జునుడికేసి వచ్చాడు. ఆ ఇద్దరికీ ద్వంద్వ యుద్ధం జరగబోతున్నదని తెలియగానే మిగిలినవాళ్ళు ఇతర ప్రసక్తులు మానేసి, ఎవరు గెలుస్తారన్న వాదోప వాదాలలోకి దిగారు.

కర్ణ శల్యులూ, కృష్ణార్జునులుకూడా తమ తమ శంఖాలను ఊదారు. కృష్ణుడూ, శల్యుడూ ఒకరినొకరు కొరకొరా చూసుకున్నారు. కర్ణుడు నవ్వుతూ శల్యుడితో, "ఈ యుద్ధంలో నేను ఓడిపోతే నీ వేంచేస్తావు? అబద్ధమాడకుండా చెప్పు," అన్నాడు.

"అర్జునుడు నిన్ను చంపేమాటుంటే నేనా కృష్ణార్జునుల నిద్దరినీ చంపేస్తాను," అన్నాడు శల్యుడు. అలాటి ప్రశ్నే అర్జును డడిగితే దానికి సమాధానంగా కృష్ణుడు, "అర్జునా, ప్రపంచం తలకిందులైనా నిన్ను కర్ణుడు చంపలేడు. ఒకవేళ అలా చంపటమే జరిగితే, నా వట్టి చేతులతో ఆ కర్ణుణ్ణీ, శల్యుణ్ణీ చంపేస్తాను," అన్నాడు.

తరవాత కర్ణార్జునులకు భయంకరమైన యుద్ధం ప్రారంభమయింది.

కర్ణుడి వద్ద అతి భయంకరమైన సర్పముఖ బాణం ఒకటి ఉన్నది. అతను దాన్ని ప్రయోగించే సరికి కృష్ణుడు అర్జునుడి రథాన్ని భూమిలోకి తొక్కాడు. గుర్రాలు మోకరించాయి. ఆ బాణం అర్జునుడి కిరీటాన్ని మాత్రం పడగొట్టింది. తరవాత కృష్ణుడు రథం దిగి తన భుజంతో రథాన్ని పైకి ఎత్తాడు. రానురాను యుద్ధంలో అర్జునుడు కర్ణుణ్ణి మించసాగాడు. కర్ణుడు బాగా దెబ్బతిన్నాడు. సమయానికి అతనికి భార్గవాస్త్రం జ్ఞాపకం రాకుండా పోయింది. దానికి తగినట్టుగానే అతని రథచక్రాలు భూమిలోకి దిగబడ్డాయి.

కర్ణుడు అర్జునుణ్ణి, రథం పైకి లాగటానికి రెండు ఘడియల వ్యవధి అడిగాడు, అంతదాకా బాణం వెయ్యవద్దన్నాడు. కాని కృష్ణుడు అర్జునుడితో, "వీడు ఎప్పుడూ అధర్మాన్నే బలపరిచాడు. వీడిపట్ల ధర్మం పాటించ నవసరంలేదు," అన్నాడు.

కర్ణుడు ఆ స్థితిలోనే తీవ్రంగా అర్జునుణ్ణి కొట్టి నొప్పించాడు. అర్జునుడి చేతి గాండీవం పడిపోయింది. అదే సమయమనుకుని కర్ణుడు తన రథాన్ని పైకి లాక్కొవటానికి దిగాడు.

"వీడు మళ్ళీ రథం ఎక్కే లోపుగా వీడి తల తెగవెయ్యి," అని కృష్ణుడన్నాడు. అర్జునుడు ఒక పదునైన బాణం కర్ణుడి పైవేశాడు, కర్ణుడి తల తెగి పడిపోయింది.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వాఖ్యలు 1961 సెప్టెంబర్ సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : విశేషంగా ప్రేమిస్తే....

రెండవ ఫోటో : వీపుపై నెక్కుతారు!

పంపినవారు : పురాణం రామచంద్ర

వేములవాడ (P.O.) కరీంనగర్ జిల్లా

**బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.**

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూల దగ్గిరకు గొర్రెలు కాచే కుర్రవాడు వచ్చి, గొర్రెపిల్లను ఎత్తుకు పోవాలని చూసిన కొంటెకుర్రాణ్ణి తను మంత్రం చదివి మేకగా మార్చానని చెప్పాడు. దాసూ వాసూలు నమ్మలేదు. "అయితే మీరొచ్చి చూడండి," అన్నాడు గొర్రెలు కాచే కుర్రాడు. దాసూ వాసూలు పొదల దగ్గిరకు వెళ్ళారు. వాళ్ళకు పొట్టిగావున్న మేక ఒకటి ఆకులు తింటూ కనిపించింది. గొర్రెలు కాచె కుర్రాడి మంత్రశక్తికి దాసూ, వాసూలు ఆశ్చర్యపోయేంతలో, 'టైగర్' వెళ్ళి వాడి కాలు పట్టుకున్నది. దానితో వాడు 'బాబో' అంటూ కేక పెట్టి, తలమీద కట్టుకున్న కొమ్ముల్నీ, పైన కప్పుకున్న మేకతోలునూ వదిలి పారిపోయాడు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



మీ

పాపాయికి

ఇష్టం

స్పెన్సర్స

గ్రైప్ సిరప్




పసిపిల్లల సమస్తమైన అజీర్ణ వ్యాధులకు

ఆంధ్రప్రదేశ్‌కు సోల్ డిస్ట్రిబ్యూటర్లు:

సిటీ ఫార్మ డిస్ట్రిబ్యూటర్స్,

రామగోపాల్ స్ట్రీట్, :: విజయవాడ - 1.



మనోహరమైన

ముఖలావణ్యమునకు

నేషనల్ వారి

కాశ్మీర్ స్నో








సినిమా

తార లందరకు

నచ్చినది

ది నేషనల్ ట్రేడింగ్ కంపెని, బొంబాయి-2 • మదరాసు-1

సినిమా
తారలు
మెచ్చిన




రెమి
పౌడర్

